

## కరపత్రాల కథా కమామీషు

జీవితం ఒక సుదీర్ఘమయిన జిజ్ఞాస. జీవించడం జీవి ప్రాథమిక పిపాస. హేతుబద్ధమయిన జీవితంలో విశ్వాసానికి తావులేదు. మౌలికంగా మార్పుకేకాని మతాలకిందులో చోటులేదు. కొద్దోగొప్పో తెలివయినవాడ్ని తెలివితక్కువవాడిగా నిరూపించడం కోసం తెలివితక్కువ సంతంతా కట్టగట్టుకుని ప్రయత్నించడం కొత్తదేం కాదు. తమకంటే బాగా ఆలోచించగల వ్యక్తి ఔన్నత్యాన్ని దిగజార్చడమే లక్ష్యంగా అవివేకులంతా తోచినప్పుడల్లా సమావేశమవడం కూడా సాధారణమయి పోయింది. అంతో ఇంతో బుర్రగలవాడిపై ఎంతో కొంత బురద జల్లి బుద్ధిమంతుడ్ని బుద్ధిహీనుడిగా ప్రచారం చేస్తూ తృప్తిపడే బూడిదబుర్రలకూ కొదవలేదు. మూర్ఖులందరూ మూకుమ్మడిగా మేధావిని మూఢుడిగా చూపించే ప్రయత్నం చేస్తూ, తమకంటే మంచివాడ్ని ఏదో విధంగా కించపరచడం ద్వారానే తమ అస్తిత్వానికి సరైన గుర్తింపు లభిస్తుందనుకోడం కూడా కద్దు. నిజం చెప్పడానికి భయపడని వాడ్ని చూసి భయపడి, నిజం చెప్పకుండా భయపెట్టాలని చూసినంతలో నిజం, నిజం కాకుండా పోదు. అబద్ధాన్ని అందంగా ప్రదర్శించడానికి అలవాటు పడి, అబద్ధాన్నే నిజంగా నిరూపించడానికి ప్రయత్నించినంతలో అబద్ధం నిజం అయిపోదు. సమాజానికి విలువివ్వని వ్యక్తుల్ని గౌరవించే లక్షణమున్న వ్యవస్థ, సమాజానికి విలువిచ్చే వ్యక్తుల్ని అగౌరవపరచడం సహజం. అందుకే, సంఘానికి ఉపయోగపడే సామర్థ్యం సమకాలీనులచేత నిజాయితీగా గుర్తించబడటం అరుదు. వ్యవస్థకి పనికొచ్చే వ్యక్తిత్వాలు వర్తమానంలో గ్రహించబడడం కష్టం. ఎంతకూడదన్నా ఏదోక సంకుచితత్వం వ్యక్తుల్ని సంపూర్ణంగా స్పందించనివ్వదు. సమూహతత్వాన్నే సమిష్టితత్వంగా భ్రమసే మూక మనస్తత్వాలు, మూగినంత మందిని కూడగట్టుకుని వూగినంతలోనో, కూడినంత మందిని సాగదీసుకుని తూలినంతలోనో ఒరిగేదేం లేదు. సంఘ సంస్కారం లేని వ్యక్తిత్వాల వల్లా, వ్యక్తిత్వ లేమికల సంఘాల వల్లా ప్రయోజనం లేదు. సమిష్టి తత్వానికర్థం ముఠాతత్వం కానట్లే, వ్యక్తిత్వానికర్థం ఏకాకితత్వం కాదు. వ్యక్తి–వ్యవస్థ ఎప్పటికీ పరస్పర ప్రేరకాలు, ప్రేరణా కారకాలు, ప్రగతి రథ చక్రాలు. వాటికి అడ్డొచ్చే అజ్ఞానం ఆధ్యాత్మికతయితే, విజ్ఞానం నా వాస్తవికత. అణిచివేత అధికార మార్గమయితే, ఎదురు తిరగడం నా నైజం. విశ్వాసం వ్యవస్థీకృత మత విధయితే అవిశ్వాసం నా హక్కు!





# తత్వ విచారణ–తర్క వివేచన

**(Philosophical Enquiry-Logical Wisdom)**

## గౌరవ్

**ప్రశ్న అధ్యయన వేదిక**
పిఠాపురం
తూర్పుగోదావరి జిల్లా

**తత్వవిచారణ - తర్క వివేచన (వ్యాసావళి)**

నాస్తిక–హేతువాద–భౌతికవాద సమాఖ్య సారథ్యంలో

ప్రచురణ కాలం : జనవరి 2014

ప్రతులు : 500

విరాళం : ఐచ్ఛికం (ఇష్టమున్నంత, కష్టంకానంత, నష్టంలేనంత)

ప్రచురణ సంఖ్య : 10

ప్రతులకు : 9441089829



---

విజ్ఞప్తి : నా పూర్వ రచన 'కరపత్రాల కథా కమామీషు'లో సంకలిత కరపత్రాల కాలం 2002 నుండి అని పడింది. అవి అప్పటివి కావు. ఆ తర్వాతవి. తత్వ విచారణ, తర్క వివేచన పేరుతో శిధిలావస్థకు చేరిపోయిన నా రాతప్రతి శీర్షిక అసందర్భం కాదనిపించి, ఈ వ్యాస సంకలనానికి, ఇందులోని మొదటి వ్యాసానికీ పెట్టుకున్నాను.

## ఇందులో...





# నేపథ్యం

*In the republic of mediocrity, genius is dangerous.*
*– R.G. Ingersoll*

అజ్ఞానం ఆధిపత్యం చెలాయిస్తున్నచోట అసాధారణ జ్ఞానం ప్రమాదకరం. మిడిమిడి జ్ఞానం మిడిసిపడేచోట సరుకున్నవాడు సర్దుకుపోవడం సహజం. నిష్క్రియాపరత్వం రాజ్యం చేస్తున్న ప్రదేశంలో ప్రజా సంక్షేమం కోసం నిబద్ధతతో ఆచరించే ఎంతటి క్రియయినా మానవతా విలువను కలిగుంటుంది. కొద్దో గొప్పో ఆలోచించగలవారూ, విద్యావంతులూ ముందుకు రాకపోవడం మూలానే ఈ విధమయిన భావజాల ప్రచురణ ప్రచార కార్యక్రమాల్ని కుదిరినంతలో నేను చేపట్టాల్సి వచ్చిందే కాని ఈ విషయాల్లో ఉండాల్సినంత పట్టు నాకు లేదు. రచనా వ్యాసాంగాన్ని క్రమం తప్పకుండా కొనసాగించేంత విషయ పరిజ్ఞానం నాకుందని నేననుకోడం లేదు. One thing only I know, and that is that I know nothing అన్న సోక్రటిస్ The only good is knowledge and the only evil is ignorance అంటాడు. నేను పెద్దగా చదూ'కొన'లేదు. ఇప్పటికీ అందుబాటులో నున్న చైతన్య సాహిత్యాన్ని చదవడం, వర్తమానంలో జరుగుతున్న సాంఘికోద్యమాల్లో కుదిరినంతలో పాల్గోడానికి ప్రయత్నిస్తూ దొరికిన ఉద్యోగాలు చేస్తూ కష్టపడ్డం నా కార్యక్రమం. I am proud to be an atheist it helps me stand for so much more and fall for so much less అంటాడు Dan Barker. నాస్తిక హేతువాదులపై కాలుదువ్వుతున్న తిరోగామి ఛాందస శక్తుల్ని వ్యతిరేకించే కార్యాచరనేదీ వర్తమాన వ్యవస్థలో కనబడకపోవడమే నా ఈ ప్రయత్నానికి ప్రధానమని నేను భావిస్తున్నా. ఈ వ్యాసాలకి ఈ శీర్షిక అసందర్భం అనిపించకపోవడం వలనే తీసుకున్నాను. సారం కాలగర్భంలో కలిసిపోయినా కనీసం శీర్షిక మిగిలిందన్నదే నాకో స్వీయ సంతృప్తి.

ఉంటాను
**గౌరవ్**

# అంకితం



నూతన విశ్వాసాన్ని ఆచరణతో నిర్మించి
ఆక్రందనల అరణ్య రోదనలకి హృదయంతో స్పందించి
అజ్ఞాత విప్లవాలకి అక్షరాభ్యాసం చేయించి
లెక్కలేనన్ని అన్యాయాలకు జంటగా జవాబుచెప్పి
దిక్కులేని జనాల హక్కుల దివిటీలై వెలిగిన
'సావిత్రిబాయిపూలే' దంపతుల స్ఫూర్తికి మనస్ఫూర్తిగా...

## What I have Lived for

*– From Autobiography of Bertrand Russel*

There passions, simple but overwhelmingly strong, have governed my life; the longing for love, the search for knowledge, and unbearable pity for the suffering of mankind. These passions, like great winds, have blown me hither and thither, in a wayward course, over a deep ocean of anguish, reaching to the very verge of despair.

I have sought love, first, because it brings ecstasy – ecstasy so great that I would often have sacrificed all the rest of life for a few hours of this joy. I have sought it, next, because it relieves lonelines – that terrible loneliness in which one shivering consciousness looks over the rim of the world into the cold unfathomable lifeless abyss. I have sought it, finally, because in the union of love I have seen, in a mystic miniature, the prefiguring vision of the heaven that saints and poets have imagined. This is what I sought, and though it might seem too good for human life, this is what – at last – I have found.

With equal passion I have sought knowledge. I have wished to understand the hearts of men. I have wished to know why the stars shine. And I have tried to apprehend the Pythagorean power by which number holds sway above the flux. A little of this, but not much, I have achieved.

Love and knowledge, so far as they were possible, led upwards toward the heavens. But always pity brought me back to earth. Echoes of cries of pain reverberate in my heart. Children in famine, victims tortured by oppressors, helpless old people a hated burden to their sons, and the whole world of loneliness, poverty, and pain make a mockery of what human life should be. I long to alleviate the evil, but I cannot, and I too suffer.

This has been my life. I have found it worth living, and would gladly live it again if the chance were offered me.



# 1. తత్వవిచారణ-తర్కవివేచన

మనిషి తనని గురించి తాను తెలుసుకుంటూ ఆ క్రమంలో తన చుట్టూ వున్న పరిసరాల్నుంచి ప్రేరణ పొందుతూ ప్రపంచాన్ని వీలైనంత లోతుగా గ్రహించడానికి ప్రయత్నిస్తుంటాడు. తన గ్రహింపులోకి వచ్చిన జ్ఞానాన్ని సత్యాన్వేషణ ద్వారా వాస్తవిక దృష్టితో మదింపు వేసుకుంటుంటాడు. అదే తాత్విక విచారణ. సత్యాసత్య నిర్ధారణల కోసం విభిన్న విషయాలపై మనిషి మానసికంగా జరిపే జిజ్ఞాసాత్మక వ్యాయామమే తార్కిక వివేచన. ఇవి రెండు పరస్పర ప్రేరకాలు.

తన ఉనికికి సంబంధించిన ఆసక్తి మానవుడ్ని జగత్తు అస్తిత్వం గురించి ఆలోచించేంతగా మార్చివేసింది. జవాబు దొరకని ప్రశ్నాపరంపరతో పయనిస్తూనే మానవాళి ప్రతీ తరంలోనూ సమాధానాల్ని సాధిస్తోంది. ప్రకృతిలోని సహజసిద్ధమయిన మార్మికతను తన విజ్ఞానంతో విపులీకరించుకుంటూనే ముందుకు సాగిపోతోంది. ఈ క్రమంలో సమాజం తనని తాను ఉన్నతీకరించుకుంటూ కుదిరినంత ఉచ్ఛస్థితి కోసం తన్నుతాను సిద్ధపరచుకుంటోంది.

సాధారణ జీవిత చక్రంలోని మౌలికాంశాల్ని గుర్తించాల్సిన పరిస్థితికి ఏ తరానికాతరం తప్పనిసరిగా నెట్టబడుతూనే వుంటుంది. మానవ మేధ నిర్మించుకున్న అవాంఛనీయమయిన సాంఘిక ఆచారాలన్నీ కాలంతోబాటు విస్తరిస్తున్న మానసిక వికాసపు సవాళ్ళను ఎదురుకోక తప్పదు. అంతదాకా కేవల జీవితావసరాలకి మాత్రమే పరిమితమయిన సామూహిక బతుకుచిత్రాలు అకస్మాత్తుగా నిర్ణీతమయిన మార్పులకు గురికాక తప్పదు.

అభాగ్యులకొచ్చిన ఆపదలని అడ్డుకోడానికి కావలసిన ఒక అవసరమయిన నిష్కల్మష, నిష్కపట నిర్మాణాత్మక వ్యవస్థకోసం ప్రతి సమాజమూ యధాశక్తితో యత్నిస్తుంది. హేతుబద్ధమయిన మేధోశ్రమను గురించి సామాన్య ప్రజలెన్నడూ బహిరంగంగా చర్చిస్తూ ప్రచారం చేసుకోనంత మాత్రాన చరిత్రగతి కొనసాగకుండా వుండదు. అనేక కర్తవ్యాల కల్లోరాల్ని కడుపులో మోసే జనాలకి తాత్విక విషయాల్ని తర్కించేటంత తీరికుండదు.

2

సాంఘిక శ్రేయస్సుకి మంచివని మనకన్పించిన విషయాల్ని గురించిన స్పృహను తప్పనిసరిగా అందరూ కలిగుండాలన్న నియమం ఎక్కడా లేదు. ఆలోచనాత్మకమైన వైవిధ్యాల్ని ఆహ్వానించకపోవడం మనుషుల ఆంతరిక అల్పత్వానికి ప్రమాణం. ఆ వైఖరి అధికమయ్యేకొద్దీ అసహిష్ణుకత బుసలుకొడుతుంది. పాక్షిక దృష్టికే పరిమితమయిన తాత్విక వివక్ష అంతిమంగా సామాజిక విద్వేషాలకి కారణమవుతుంది.

ఏ కాలంలో తాత్వికులు ఊహించిన ఆదర్శమానవుడయినా తమ కాలంలోని సాధారణ ఆలోచనా పరిధికంటే ఒకడుగు ముందుకొచ్చి ఆలోచించే స్థాయిని కలిగి ఉన్నాడు. అటువంటి నిర్దిష్టమయిన మానవీయ ఆలోచనలే సామూహిక సంకల్పాలతో విలువలగా రూపుదిద్దుకున్నాయి. శ్రేయస్సనేది సార్వజనీనంగా ఉన్నప్పుడే ప్రపంచశాంతి నెలకొంటుందనే భావన ఆవిర్భవించిననాడే సమాజంలోని అశాంతి గురించిన ప్రస్తావన ప్రాధాన్యతను సంతరించుకుంది.

అశాంతికి గల కారణాల్ని అనివార్యమయిన అతీతశక్తిమీదా, అదృశ్యమయిన సామాజిక విధిమీదా కూడా వేసి అప్పటికీ సంతృప్తి చెందని మనసుని చల్లబరుచుకోవడానికిగాను 'మానవ ప్రవృత్తి'ని తెరపైకి తెచ్చిన తాత్వికులు సైతం వారి ప్రతిపాదనల్లోని లోపాల్ని గురించి ఎంతో కొంత తెలిసి తమ దృక్కోణాన్ని ఆరోగ్యకరమయిన సంవాదం కోసం ఆశ్రయించినవారే. అందుకే నిబద్ధతగల ఏ తాత్వికావగాహనగల తార్కిక చర్చయినా వైషమ్య దృష్టిలేని సామరస్య వాతావరణాన్నే గీటురాయి చేసుకుంటుంది.

ప్రపంచానికి బొత్తిగా పరిచయంలేని అతీతశక్తి గురించిన కాల్పనిక కథల్ని అల్లుకోవడంవల్ల గానీ, అటువంటి సత్యాన్ని తెలుసుకోవడం వల్లగానీ ప్రయోజన మేమిటనే ప్రశ్న సత్యాన్వేషణ పిపాసకల తాత్వికులకి ప్రారంభంలోనే తట్టింది. భౌతిక లోకంలోని సమస్యలకి అజ్ఞాత ఊహాలోకంలో పరిష్కారాల్ని వెతకడం అవివేకమనే వాదన ఆరంభ మానవుడ్ని తనని గురించి తన చుట్టూ సమాజాన్ని గురించి ఆలోచించేలా చేసింది. అదే మానవవాదం.

అసమానత్వాన్ని భౌతిక వాస్తవంగా కాక కొన్ని వర్గాల మానసిక భావనగా భాష్యం చెప్పిన మతాలపై కనీసం కొంతమందికైనా విశ్వాసం సడలి వుంటుంది. అందుకే, అతీతశక్తుల్ని గురించిన మార్మిక భావనల్ని ఒకవైపు అభివృద్ధి చేసుకుంటూనే మరోవైపు మానవిక, మానసిక నైపుణ్యాల్ని పెంపొందించుకునే క్రమం కొనసాగింది. స్వేచ్ఛాస్వాతంత్రాల్ని అవకాశమున్నంతమేర అవగతం చేసుకుందుకు కృషి జరిగింది.

3

కొన్ని నిర్ణీతమయిన పదబంధాలకి సంబంధించిన, కొన్ని వర్గాల కుతూహలానికి అనుకూలమయిన ప్రతిపాదనల్ని మాత్రమే 'తత్వశాస్త్రం'గా భావించే నేపథ్యం నుంచి, అన్ని వర్గాల ప్రజల్నీ దృష్టిలో పెట్టుకుని ప్రతి తరగతికి చెందిన ప్రజానీకపు అవసరాల్ని, అసంతృప్తుల్నీ పరిగణనలోకి తీసుకుని పరిశోధించడం చోటు చేసుకుంది. అమూర్తమైన దానికన్నా ఐహికమైనదాన్నీ, మార్మికభావనలకంటే మానవికమైనవాట్ని పరిశీలించడం మొదలైంది.

సాంఘిక రేఖా చిత్రంలో ముఖ్య భాగాన్ని ఆక్రమించుకున్న మతాలన్నీ కొన్ని అనివార్యమయిన సందర్భాల్లో వెనక్కినెట్టబడ్డాయి. ప్రతికూలమయిన పరిస్థితులలో కూడా విజ్ఞానశాస్త్రం చతికిలబడి విశ్రాంతి తీసుకోలేదు. సమాజానికి ఉపయోగపడే నూతన ఆవిష్కరణల్ని సోదర మానవాళికి అందించాలనే తపన వైజ్ఞానిక దృష్టిని విస్తృతం చేసింది. వ్యవస్థకి వీలైనంత సౌకర్యవంతమైన సాధనాల్ని సమకూర్చాలనే తృష్ణ దార్శనిక కృషిని విస్పష్టం చేసింది.

తాత్వికవగాహనలోకల లోపాల్ని గుర్తించేక్రమం తార్కిక ఖాళీల్ని పూరించింది. ఒక నిర్దిష్టమయిన విషయంపై జరిగే చర్చ పరమార్థం జ్ఞానసముపార్జనే అనే భావనతోపాటు, సముపార్జింపబడిన జ్ఞానం సామాజీకరణ చెందినప్పుడే అర్థవంతమవుతుందన్న భావన వృద్ధి చేయబడింది. కేవల జ్ఞానం వ్యక్తుల అహంకారాలకి కారణమవుతే శాస్త్ర విజ్ఞానం వ్యవస్థ పురోగతికి తోడ్పడుతుందనే విషయం తెలిసొచ్చింది.

సామూహిక ప్రయోజనాల్ని ఆశించలేని జ్ఞానం సాంఘిక కళ్యాణానికి పనికిరాదు. అటువంటి జ్ఞానాన్ని అధ్యయనం చేయడం వలన అద్వితీయమైన విషయ పరిజ్ఞానం పెంపొంది పాండిత్య ప్రదర్శన కావించుకునేందుకు అవకాశముండగలదేమో కాని సామాజిక శ్రేయస్సు కోసం ఒరిగేదేమీ ఉండదు. సాటి మనుషులకు జరుగుతున్న నష్టాల్ని, సమకాలీన సమాజపు కష్టాల్ని చూస్తూ స్పందించని జ్ఞానానికి ఏ

కాలంలోనయినా సార్ధకత చేకూరదు. అటువంటి జ్ఞానం ఎంత సామర్థ్యం కలదైనా అంతిమంగా సంకుచితంగా మిగిలిపోవలసిందే కాని సార్వజనీనతను సంతరించు కోలేదు.

సత్యాసత్య వివేచన, సాంఘిక విలువల రక్షణ, ప్రజాస్వామ్య హక్కుల సాధన మొదలైన విభాగాల్నుండి విడివడి మనిషి రహస్యంగా జరిపే తత్వశాస్త్ర తంతులేమీ ఉండవు. మార్పును గురించిన మానవాళి భావనలన్నీ మౌలికంగా మానసిక పరిపక్వతతో ముడిపడి ఉంటాయి. దైనందిన జీవితంలోని రోజువారీక్రమానికి అలవాటుపడిన సామాన్యుడి ఆలోచనలు ఉన్నట్టుండి పూర్వపక్షం కావించబడడానికి ఒప్పుకోవు. పౌరసత్వమనే, మతతత్వమనే వారసత్వ బానిసత్వాలకి గురైన భావాలు వాటంతటవే స్వచ్ఛందంగా సమసిపోవు.

4

మానవ సమాజంలో అసమానతలనేవి సహజమేనని బోధించడానికే పూర్వం నుండి మతరాజ్యాలు పాటుపడుతున్నాయి. వ్యవస్థలోని అత్యధికమందిచేత వ్యవస్థీకృతమయిన అసమానతల్ని అంగీకరింపచేసి, కొంతమందికే పరిమితమయిన ప్రత్యేక సౌకర్యాల్ని కాపాడుతూ వివక్ష 'సాధారణమని' నమ్మగలిగేలా సామాన్యుల్ని ఆలోచింపజేయడం వీటి అప్రకటిత లక్ష్యం. ఇవి ప్రతిపాదించే తాత్విక విషయాలన్నీ ఈ కోవకి చెందినవే అయ్యుంటాయి.

ఒక జీవితకాలంలో సాధించలేని విజ్ఞానశాస్త్ర విశేషాలెన్నో పరిణామాత్మకంగా ప్రయోగాత్మకంగా రుజువు కాబడి ఈరోజు సాంఘిక గమనంలో కీలకంగా మారాయి. కానీ, ఎన్ని జీవిత కాలాలైనా మనిషి మనిషిగా అర్ధం చేసుకోలేని వ్యర్ధపు విషయాలన్నీ ఇంకా వ్యవస్థని వెంబడిస్తూ సమాజంలో అవాంఛనీయమయిన పాత్ర పోషిస్తున్నాయి. అలౌకికమయిన అవాస్తవ కథనాలన్నీ ఉన్నతంగా చలామణీ అవుతుంటే, అందుబాటులోకి వచ్చిన ప్రయోజనాత్మక వాస్తవిక విజ్ఞానం చులకనగా చూడబడు తోంది.

ఎంత ప్రయత్నించినా ఎక్కువమందికి అర్ధంకాని అంశాలన్నీ కేవలం కొంతమంది సొంతలాభాల కోసం వ్యవస్థ నెత్తిన రుద్దబడుతుంటే, స్వల్ప ప్రయత్నంతో అందరూ తెలుసుకోగలిగే సామాజిక అంశాలన్నీ కొద్దిమందికే పరిమితమై అత్యధిక శాతం



మందిచేత అంటరానివిగా ఎంచబడుతున్నాయి. వోపిగ్గా కొద్దిరోజులు ముద్దుగా రుద్దాలేకాని ఎలాంటి జిడ్డునైనా జనాలు రుద్దించుకుంటారనే వెకిలి అభిప్రాయమే ఈ ఆలోచనలకు మూలం.

సమాజంలోని చైతన్యవంతమైన భావజాలాన్ని కుదిరినంత కుదించడమే ఏ కాలంలోనయినా కుటిల మనస్సులకి తట్టే అక్రమాలోచన. అందుకు విరుద్ధంగా ఉద్యమించడమే ప్రజాస్వామిక శక్తుల సైద్ధాంతిక తాత్విక బాధ్యత. ప్రజాస్వామిక కాంక్షను కలిగించడం, సమతా స్పృహను విస్తరించడం, మానవికమయిన సమాజ స్థాపనకోసం ప్రయత్నించడం, స్వేచ్ఛా స్వాతంత్ర్య, సౌభ్రాతత్వాల ఆవశ్యకతనూ, విస్తృతినీ గుర్తించడం ఆ బాధ్యతలో భాగమే.

5

ప్రజాతంత్ర భావజాల వ్యాప్తికోసం ప్రయత్నించడం, ప్రజాస్వామిక ఆలోచనల ప్రయోగాత్మక ఆచరణకోసం ఉద్యమించడం, ప్రజాతాత్విక భావజాలాన్ని ఉన్నతీకరించు కోడంలో భాగమే. సమకాలీన సమాజంలోని వాస్తవిక ధోరణుల్ని ప్రతిబింబించలేని 'పరమ సత్యాల్ని' స్తుతించే కాల్పనిక వాదనలకి కాలంచెల్లే స్థితి అంతకంతకూ దూరమవుతుండటం ప్రగతిపక్షం తీసుకున్న అభ్యుదయ శక్తుల తాత్విక కృషిలో తేటతెల్లమవుతున్న లోపాల్ని బహిరంగంగానే వెల్లడి చేస్తోంది.

దశాబ్దాల క్రితమే ఈ విషయం తెలిసినా ఆలోచనాత్మక పక్షాలేవీ తమ ప్రణాళికల్ని సరిచూసుకోడానికి కానీ, కార్యక్రమాల్ని సరిచేసుకోడానికి గానీ సిద్ధపడకపోవడానికి లోతైన కారణాలేవీ కానరాడం లేదు. కాన ఈ పరిస్థితికి సంబంధించిన చర్చను అన్ని పక్షాలూ స్వీకరించి వాళ్ళు తమ కార్యాచరణకి పునాదిగా భావిస్తున్న తాత్వికతను గురించికానీ, ప్రస్తుత సమాజంలో దాని స్వభావాన్నీ, భవిష్యత్ ఊహాచిత్రాన్ని పునః పరిశీలన చేసుకుంటే ఉద్యమక్షేత్రాలకీ, భావజాల ఉన్నతికీ ఉపయుక్తంగా ఉంటుందేమో యోచిస్తే మంచిది.

నడుస్తున్న వ్యవస్థలోని లోపాల్ని గుర్తించడం జరుగుతున్న తప్పుల్ని సరిచేయడాన్ని గురించిన స్పృహను కలిగించాలే కాని సాగుతున్న బాధల్ని కొనసాగనిద్దామనే నిస్పృహనూ, గడిపినంతసేపూ అబద్దపు ఆశావాదిగా నటించి నిష్క్రమిద్దామనే మధ్యతరగతి నిరాశనూ కలిగించకూడదు. మరుగుపడ్డ అన్యాయాల్ని ప్రశ్నించడం

మర్యాదస్తుల లక్షణం కాదనుకునే మనస్తత్వపు వెనకబాటుతనమే సమాజంలోని అసమానతకి ఆయువుపట్టని గుర్తించనంతకాలం ప్రయత్నపూర్వకమయిన చైతన్యోద్యమాలు వ్యక్తులచేత ఓటమిపాలవుతూ సాంఘికంగా వెనకబడిపోతూనే ఉంటాయి.

అసమానత్వానికి అసలు కారణం అన్వేషించేటంత శక్తీ, ఆసక్తీ లేని మహానుభావు లందరూ ఇప్పటికే అడవులకో, ఆధ్యాత్మికతకో, ఆధునికతకో పరిమితమయ్యారు. అసమానత్వానికి పరిష్కారం సమానత్వమని అంగీకరించని వాళ్లే ఈ రోజు సామ్రాజ్యవాద పాలకులుగా, బోధకులుగా జనాభాలో ముఖ్యభూమిక పోషిస్తున్నారు. నిస్తేజమైన ఇలాంటి పరిస్థితుల్లో సమానత్వాన్ని బోధిస్తున్నాయని భ్రమ కల్పించే మతతత్వ భావనల్ని ఎదురుకుంటూ మానవ అభ్యున్నతిని ఆశించే, పాటించే ఆచరణాత్మక తాత్విక భావనల్ని ప్రజానీకానికీ ముఖ్యంగా, విద్యార్థులకి – యువతకి అందించగలగడం ఆలోచనాపరుల విధి.

6

ఎవరికి వారే మాదే నిజమనుకునే లోకంలో సమాజ హితం కోసం నిజాయితీగా కాంక్షించేవారివైపు నిలబడి చాతనైన పని మౌనంగా చేసుకుపోవడమంత ఉత్తమం మరోటి లేదు. వ్యవస్థితమైన ఆధిపత్యానికి అలవాటుపడ్డ మనస్తత్వాలు అణిచివేతని అణుకువగానూ, అహంకారాన్ని మమకారంగానూ భావించడం వల్లనే సాంఘిక క్రూరత్వం కుటుంబ వ్యవస్థలో కూడా అనివార్యంగా అమలవుతోంది. అందుకే, స్త్రీలని, పిల్లల్ని కాలరాసే అధికారం తన హక్కని సమాజం అనుకుంటుంది.

భాష మాత్రమే సున్నితంగా తీర్చిదిద్దబడేచోట భావాలకి వుండాల్సినంత విలువుండదు. వాక్యాలు వార్ధక్యంలోకి వొరిగిపోయిన చోట పదాలకి అర్థాల్ని అన్వేషించడమే పరమార్థమై వ్యక్తిగత ప్రవర్తన దిగజారిపోతుంది. అవాంఛనీయమయిన నాగరికతకెప్పుడూ అవాస్తవాలే ప్రమాణాలౌతాయి. అలాంటప్పుడు, వాస్తవాలన్నీ అనాగరికంగా చూడబడతాయి. సమాజంలోని ప్రత్యక్ష మానవ సంబంధాల్ని ప్రస్తావించని ప్రసార మాధ్యమాలన్నీ వ్యవస్థకతీతంగా మసులుకునే వ్యక్తుల్నే కథానాయకులుగా చూపిస్తాయి.



ప్రజల్ని అనివార్యమయిన అవాస్తవ స్థితుల్ని ఆరాధించే పరిస్థితుల్లోకి బలవంతాన నెట్టడమే వీటి కర్తవ్యం. అందుకే, ప్రజల ఈతిబాధలకు జవాబు చెప్పలేని ప్రభుత్వాలు, మతాలు, ప్రసారమాధ్యమాలు, వాళ్ళకి నీతిబోధలు చేస్తుంటాయి. భుక్తిని ప్రసాదించలేని దేవుళ్ళంతా ముక్తినెలా ప్రసాదించగలరనే ప్రశ్న తలెత్తేటంత యుక్తి సామాన్యుల కుండదనే కుయుక్తే మతాల్ని అభివృద్ధి చేసింది. ఇందుకే వీటన్నింటికీ మనిషంటేనే పరమ లోకువ.

మానవత్వమంటే ఎంత లోకువైతే వాటి భావజాలం అంత లోతైనదనే భ్రాంతిని అవి కలిగిుంటాయి. అందుకే మిగిలిన అన్ని భావజాలాలు భ్రమలని భ్రమపడతాయి. ఆ భ్రమతోనే ప్రజల్ని మభ్యపెడతాయి. ఏ విధమయిన తాత్విక సమున్నతికైనా చరిత్రలో ఇరుపక్షాల వైజ్ఞానిక సైద్ధాంతిక సంవాదననే సాక్ష్యంగా తీసుకుని మరింత మానవీయమయిన నూతన పద్ధతులాధారంగా పరస్పర ప్రత్యామ్నాయ జిజ్ఞాసాత్మక విజ్ఞాన సృజనలకి సంబంధించిన కృషి జరపాలే కాని అసత్యాలమీదనో అహంభావాల మీదనో ఆధారపడి కారాదు.

ఒక విషయంపై విభిన్నమయిన అభిప్రాయాలు కలిగుండేంత స్వేచ్ఛా, వాటిని వెల్లడించేంత స్వతంత్రం నాగరికమయిన ప్రతీ వ్యవస్థలోనూ యిమిడివుండాలనే ఆకాంక్ష, ఆచరణాత్మకంగా ఎంతవరకూ అమలవుతుందనే దానితోనే ఆధునిక తాత్వికౌన్నత్యం ముడిపడుంటుంది. సాంఘిక స్థాయిని బట్టీ, మృదువయిన భాషను బట్టీ, వ్యక్తిగత ప్రవర్తననుబట్టీ బహిర్గత పరచబడిన భావాలను పరిగణనలోకి తీసుకునే ఆంతరికల్పత్వాలకి సమాజం కట్టుబడుతున్నంతకాలం మానవాళి తాత్విక తృష్ణను నిస్వార్థ నిర్ణయాలకంటే కూడా స్వార్థపు నియంతృత్వాలే కనబడకుండా కట్టడి చేస్తుంటాయి.



# 2. భౌతికవాదులున్నారు బహుపరాక్!

"Materialism is also the natural born son of India"

– Dr. K.B. Krishna, *Studies in Hindu Materialism*

అభౌతికమైనదేదీ అస్తిత్వంలో లేదు. అస్తిత్వమంటేనే భౌతిక జనితం. మనిషి భావోత్పత్తి భౌతిక సంకల్ప ఫలితమే. మనిషి ప్రాథమికంగా భౌతికవాది. పారమార్థికమైన భావాలు ఎన్ని అతనిలో ఉత్పన్నమైనా, అవన్నీ అతడి పాదార్థిక మేధో జన్యాలే. మానవాళి ఆలోచనలు – ఆచరణలు అన్నీ కూడా భౌతిక సౌకర్యార్థం భవితను మరింత సౌఖ్యవంతం చేసుకునేందుకు ఉద్భవించినవే అయ్యుంటాయి. భౌతికవాదం విస్తృతమయినది. శుద్ధ భౌతికవాదాన్నో – యాంత్రిక భౌతికవాదాన్నో అవలంబించడం వల్ల ప్రాపంచిక దృక్పథం సంకుచితమవుతుంది. చాలామంది భౌతికమనే పదాన్ని కేవల జీవితానికీ, దైనందిన కార్యకలాపాలకి అన్వయించుకోవడం వలనే భౌతికవాద దృక్కోణం కుంటుపడింది. అనాదిగా మనిషి భవిష్యత్తుని సుసంపన్నం చేసేందుకు జరిగిన ప్రయత్నాలన్నీ భౌతికపరమైనవే. చరిత్రలో తిరుగుబాట్లూ, విప్లవాలు భౌతిక సంకల్ప ఫలాలే. కాని విచిత్రమేమిటంటే, భౌతికతను కేవల పదార్థభరితంగా, ఇంకా చెప్పాలంటే వొట్టి శరీరంగా అర్థం చేసుకునే అల్పజ్ఞానం దీనికి కారణం. ఆదిమ మానవుడు తొలిసారిగా మెదడు యొక్క గుణాన్ని అనుభవించాడు, ఆ క్రమంలో 'మనసు' అనే లక్షణాన్ని అనుభూతి చెందాడు. బాహ్య ప్రకృతిని ప్రపంచంగానూ, భౌతిక పరిసరాల్ని వింతగానూ పరికించనారంభించాడు. ఆ పరిస్థితుల్లో జరిగిన చర్యలన్నీ మానసికంగా అతడిలో లోతైన అంతర్గత ప్రభావాల్ని కలిగించాయి. అతి సున్నితమయిన మేధో కణాలు స్పందించి 'మనసు' అనే ఆలోచనాత్మక స్పర్శను అందించాయి. ఆ భావనలు క్రమంగా ఎదగనారంభించాయి. కాలక్రమంలో అవి కాల్పనికంగా అభివృద్ధి చెంది విభిన్న రకాల వివేచనాత్మక ఆవేశాలకు అతడ్ని లోనుచేయడం జరిగింది. అప్పుడే మనిషిలో కళాత్మకత పెల్లుబికింది. పరిసరాల్ని పరిశీలించడం, జీవితాన్ని పరిశోధించడం ప్రారంభించాడు. ఈనాడు మనకి అందుబాటు లోనున్న ప్రాచీన గుహల్లోని చిత్రాలు, వస్తువులు అతడి ఆరంభ దినాల్లోని కళాత్మక అనుభూతికి ప్రేరణలే. అన్ని కాల్పనిక ఊహల్లాగానే దైవభావన కూడా ఆనాటి నుంచి ఈనాటి దాకా మనిషిలో నానాటికీ నానుతూ వివిధ మతాలుగా వేర్లూనుతూ వృద్ధి చెందింది. చెట్టుని, పుట్టని, గుట్టని, మెట్టని ఆరాదించే నాటి నుంచి వివిధ రకాల దేవుళ్ళూ, దేవతలూ అమానవీయమయిన అద్భుత లక్షణాలు, చిత్ర విచిత్రమైన కల్పిత అతీత శక్తుల్ని ఆ రూపాలకు ఆపాదించుకోవడం అలవాటు చేసుకున్నారు. సగటు మనిషి ఐహిక జ్ఞానానికి అతీతమైనదాన్ని అన్వేషిస్తున్నాననే భ్రమని గొప్పగా భావిస్తాడు. తనలో అంతర్లీనంగా దోబూచులాడే అజ్ఞాత భావన లన్నింటిన్నీ అలౌకికత్వంలో బంధించేస్తుంటాడు. అయితే, వాస్తవానికి ఆ భావనలన్నీ కూడా భౌతికత్వంలోంచి వచ్చినవే. అవే కాదు. ఈరోజు 'మనిషి' తాను మనిషినని గర్వించడానికి ఉపయోగపడుతున్న అన్ని గుణలక్షణాలు పరిణామ క్రమంలో సంఘర్షణద్వారా అతడికి అలవడినవే.

ఆహార సేకరణలో భాగంగా జంతుల అరుపుల్ని అనుకరించడం మనిషి అలవర్చుకుంటూనే, తోటి మానవులతో మమేకమవడానికిగానూ సంతోషాన్ని, బాధనీ, భయాన్ని, క్రోధాన్ని వ్యక్తం చేసే సంకేతిక శబ్దాలను కూడా సృష్టించుకున్నాడు. నిత్య సంచారిగా తిరిగిన ఆనాటి మానవుడికి ఆ శబ్దాలే వేటలోను, సమష్టి జీవనంలోనూ సహాయంగా ఉండేవి. కాలక్రమంలో ఆ శబ్దాలే చిన్న చిన్న పలుకులుగా పదాలుగా వృద్ధి చెంది అనేక ప్రాంతాల్లో అనేక భాషలు ఉద్భవించాయి. కళలూ, సంస్కృతులూ, సంప్రదాయాలూ అన్నీ ఈ విదంగా ఉత్పత్తి అయినవే. ఈ రకమయిన భౌతిక ఘర్షనే భావోత్పత్తిని వేగవంతం చేసింది. బావాల్ని నిక్షిప్తం చేసేటందుకు అవకాశం కల్పించింది. అనివార్యమయిన పరిణితికి చరిత్ర రచన దోహదపడింది. మనిషి బావవికాసానికీ సాంస్కృతిక పురోభివృద్ధికి దగ్గరి సంబందం ఉంది. బౌద్దిక – భౌతిక ధోరణులు అవినాభావంగా ఈ వికాసానికి తోడ్పడ్డాయి. ఈ క్రమంలో మనిషి మానసికంగాను, శారీరకంగాను వ్యక్తిగా పక్వత నొందాడు. అంతకుముందు పశు ప్రాయుడిగా అర్ద మానవుడిగా తిరుగాడినవాడు పూర్ణ మానవుడిగా ఆవిర్భవించాడు. మానవజాతి చరిత్రలో మహావిప్లవం చెలరేగింది. అన్ని రకాల ఆలోచనలు అన్నివైపులకి ప్రసరించడం మొదలుపెట్టాయి. స్వీయ మానసిక వ్యాయామం ద్వారా భౌతిక పరిణామాన్ని అర్థం చేసుకోగలిగితే ఇదంతా సులభంగానే అర్థమవుతుంది. అలాకాక స్థూలంగా మనిషిని జంతువుతో పోల్చిచూసి మనిషి పశువు నుంచి రావడం అసాధ్యమనే నిర్ణయానికొస్తే అది మన ఆలోచనా పరిధిని సంకుచితం చేస్తుంది తప్పితే ప్రయోజనముండదు. "The social world, properly speaking, the human world in short, humanity is nothing other than the last and

supreme development at least on our plant and as far as we know the highest manifestation of animity". అంటాడో వేత్త. కోతి నుంచి మనిషి రావడమనే విషయమే చాలా ఎబ్బెట్టుగా, నమ్మశక్యం కానిదిగా అనిపించేవారికి ఏమీలేని శూన్యం లోంచి ఏదైనా రావడం ఎలా సాధ్యమో తర్కించేంత తీరికుండదు. భౌతికత్వాన్ని అర్థం చేసుకునేటంత కాలాన్ని వెచ్చించడానికి వెనకాడే మనస్తత్వాలు దేవుడనే రెడీమేడ్ జవాబుతో ఆగిపోతాయి. ఇక ఆ ఊహకి వీలైనన్ని వింత మేకప్పులు చేసేస్తాయి. అందుకే ఏ అతీత శక్తుల అద్భుత చరిత్రలు లేని దేవుళ్ళెవరూ మనకుండరు. మానవాతీత మహిమాన్విత శక్తులు మనిషి కాల్పనిక ఊహల్లోని భావనా రూపాలేకాని వేరు కావు. ఆది మానవుడి ఆదిమ దేవుడు అందుకే అనేక రకాలుగా చిత్రించబడ్డాడు. "yes, our first ancestors, our Adams and our Eves, were, if not gorillas, very near relatives of gorillas, omnivorous, intelligent and ferocious beasts, endowed in a higher degree than the animals of another species with two precious faculties - the power to think and the desire to rebel." అంటాడు మైఖేల్ బకునిన్. ఆలోచించడమనే మహత్తరమయిన ప్రక్రియ మానవాళిని ఎప్పటికప్పుడు విప్లవీకరిస్తూనే ఉంది. అనుసరించడం సాధారణమైపోయిన సమాజానికి సొంతంగా ఆలోచించడమనేదెప్పుడూ విప్లవాత్మకం గానే కనిపిస్తుంటుంది.

అనాదిగా ఆయా కాలాలకి, వ్యవస్థలకి భిన్నంగా ఆలోచించేవారెప్పుడూ ప్రమాదకారులుగానే పరిగణించబడ్డారు. మనిషి భౌతిక జీవితాన్ని ఆధారం చేసుకునే అతడి భావాలు రూపొందుతాయి. సాంఘిక సంపర్కాన్ని మినహాయించి మనిషి అభివృద్ధి చేసుకోదగ్గ భావాలేవీ ఉండవు. పూర్వం నుంచి మనిషి తన జీవిత అర్థం, సారం, సత్యం తెలుసుకోవడానికి ఎప్పుడూ అన్వేషిస్తూనే ఉన్నాడు. ఆ సందేహాల డోలాయమానంలో అతనెప్పుడూ సంతృప్తి పొందలేదు. నిరంతరాయమయిన ప్రశ్నాపరంపరను అవిశ్రాంతంగా పరిష్కరిస్తూనే ఉన్నాడు. తన ముందుతరాల వారు సంగ్రహించి పెట్టిన జ్ఞాన సమాచారం ఎంతవరకూ సరయినదో తన విజ్ఞానంతో మదింపు వేసుకుంటూనే ముందుకు సాగిపోతున్నాడు. ఆ క్రమం కొనసాగుతూనే ఉందింకా. "The philosopher, like the poet or artist, is always the product of the society in which he moves and teaches." అంటాడు క్రోపొట్కిన్. మానవాళి బౌద్ధికాభివృద్ధి, సాంఘికాభివృద్ధిలో భాగం. సామూహిక చైతన్య పర్వమే మానవజాతికి చరిత్రను సమకూర్చి గార్డెన్‌చైల్డ్ అన్నట్టు మానవుడ్ని చరిత్ర నిర్మాతను చేసింది. ఈ క్రమం ఒక్కరోజులో జరిగిందీ కాదు. ఒక్క ఘటనతో ముగిసిందీ కాదు. కొన్ని శతాబ్దాల సుదీర్ఘమయిన కాలం దీంట్లో మమేకమై ఉంది. మనిషి చరిత్రలో ఎన్నో విజయానందాలు, మరెన్నో పరాజయానుభవాలు లిఖితమై ఉన్నాయి. సరైన భౌతికవాద దృక్పథంతో తప్పించి చరిత్రను పరిశీలించడం సాధ్యం కాదు. చరిత్రంటే చేట భారతం కాదు.

× × × × ×

భౌతికవాదం ఆధారంగా భావవాదం ఏర్పడింది. మనిషి మెదడులోని పదార్థ భౌతికతే భావవాదంతో భగవంతుడ్ని ఊహించింది. అనేక అంధవిశ్వాసాలతో సాధ్యమైనన్ని అలంకారిక అందమయిన శబ్దాలతో – చిత్రాలతో దేవుడ్ని సృష్టించడం జరిగింది. అదక్కడితో ఆగలేదు. విభిన్న మూఢ నమ్మకాలు చోటు చేసుకున్నాయి. తనకి తెలీని, అర్థంకాని అన్ని విషయాలకీ అప్రయత్నంగానే అలౌకికత్వాన్ని అంటగట్టి ఆరాధించడం ఆరంభమైంది. "what the mind doesn't understand, it worships or fears" అంటాడు Alice Walker. అజ్ఞానంలో జీవిస్తూ అన్ని విషయాల్ని గురించి గందరగోళపడుతున్న నాటి మానవుడికి ఆ మూఢ నమ్మకాలు ఎంతోకొంత వోదార్పునందించి ఉంటాయి. అభివృద్ధి చెందిన ఈ ఆధునిక యుగంలోనే లెక్కలేనన్ని పిచ్చి నమ్మకాల్ని చూస్తున్న మనకు ఆనాటి మానవుల అధమస్థాయి ఆశ్చర్యం కలిగించడంలో అర్థం లేదు. "since man cannot live without miracles, he will provide himself with miracles of his own making. He will believe in witchcraft and sorcery, even though he may otherwise be a heretic, an atheist, and a rebel" అంటాడు ప్రఖ్యాత రష్యన్ రచయిత దోస్తోవిస్కీ. ప్రస్తుత వ్యవస్థలో సైతం ఈ రకమయిన తిరోగమన క్రమం లేకపోలేదు. లౌకికతను అర్థం చేసుకోవడంలో వెనుకబడిన మానవుడు పూజించడానికి గాను ఒక వ్యక్తిని రూపొందించుకునే పనిలో పడ్డాడు. తన మానసిక అశక్తతను అదుపుచేసే ప్రయత్నంలో ఒక శక్తివంతమయిన కాల్పనిక రూపానికి ఆకారమిచ్చాడు, తనకి తోచిన సర్వశక్తులూ, గుణాగుణాలు, లక్షణాలు, విద్యలు అన్నీ ఆ రూపంలోకి చొప్పించాడు. ఎక్కడెప్పుడెలా తన అసహాయతను గుర్తించాల్సి వచ్చినా ఆ రూపాన్ని గుర్తు చేసుకోవడం మొదలెట్టాడు.

కష్టాల నుండి, ప్రమాదాల నుంచి కాపాడమంటూ ఆ ఆకారానికి మొరపెట్టుకోవడం ప్రారంభించాడు. ఆ ఆకారాన్ని సంతృప్తి పరచడం కోసం సామాన్యంగా తాను వేటినయితే తృప్తిగా భావిస్తాడో వాటినే సమర్పించుకునేవాడు. "Man, so long as he remains free, has no more constant and agonizing anxiety than find as quickly as possible someone to worship" అంటాడు దోస్తోవిస్కీ.

భగవంతుడనే భావన మతంతో పోలేదు, మారణ హోమానికి దారితీసింది. ఊహాత్మక ఆకారాలకు శక్తుల్ని అంటగట్టి తన దేవుడే శక్తిమంతుడనే భావన వృద్ధి చెందింది. ప్రపంచంలో ఏ కాలంలో అమలయిన ఆకారాల ఆరాధనా స్వరూపాలయినా, అవి అజ్ఞాన రూపాలే కాని వేరు కావు. ఈ విషయాన్ని గ్రహించేంతలోనే ఎవరు తయారుచేసిన రూపాన్ని గురించి వారు వివిధ ఆశలు, అసంతృప్తులు, పండగలు, తిరునాళ్ళు తగిలించుకున్నారు. తమ ఆకారాన్ని అందరికీ దేవుడ్ని చేయాలనే కాంక్షతో తోచిన లక్షణాలన్నిటినీ ఆపాదిస్తూ పోయారు. కుదరకపోతే మొదటి దేవుడ్ని పక్కకు నెట్టి మరింత అతీత శక్తులతో కూడిన శక్తివంతమైన మరో ఆకారాన్ని సృజించడం మొదలుపెట్టారు. ఈరోజు ప్రపంచవ్యాప్తంగా ఏదో రూపంలో ప్రజలచేత పూజలు, ప్రార్ధనలు అందుకుంటున్న ఆకారాలన్నీ తొలిరోజుల్లో అలా ఊహించబడినవే. తమ తమ జీవితకాలాల్లో రాజరికానికీ – అన్యాయానికి వ్యతిరేకంగా పోరాడినవార్నీ, వ్యవస్థిత ఆలోచనలకి భిన్నంగా ప్రచారాలు జరిపిన ప్రవక్తల్ని జనాలు దేవుళ్ళని చేసేసారు. అయితే, ఆ క్రమానికి ప్రత్యామ్నాయంగా వొచ్చిన భావాలు కూడా బొత్తిగా లేకుండా పోలేదు. భావవాదానికి మూలమయిన భౌతికవాదాన్ని గుర్తించి భౌతికవాద తాత్విక దృక్పధాన్ని అభివృద్ధి చేసేందుకు కొద్దిమంది ప్రయత్నించారు. "No philosophy, no religion has ever brought so glad a message to the world as this good news of Atheism.' అంటారు Annie Wood Besant. అయితే భావవాదాన్ని గుర్తించినంతగా దీన్ని గుర్తించే చేవ ప్రజల్లోను, పాలకుల్లోను ఉండదు. విచిత్రమేమిటంటే సంకుచితమయిన పరిమితులకు విరుద్ధంగా ప్రచారం చేస్తున్న ఈ స్వతంత్ర భావజాలాలకు కూడా దడికట్టే ద్రోహులు ఆనాడే తయారయ్యారు. నాస్తికత్వ భౌతికవాదాల్ని కూడా వొక మతంగా దుష్ప్రచారం చేసారు. "calling Atheism a religion is like calling bald a hair colour" అంటాడు Don Hirschberg. భారతీయ భౌతికవాదానికి ప్రతీకలయిన చార్వాకలోకాయతాలకి పట్టిన గతే ప్రపంచంలోని అన్ని ప్రగతి వాదాలకి ప్రారంభంలో పట్టుంటుందనడానికి సందేహాలక్కర్లేదు. ఈ రోజుకీ కూడా తమ మతాలపై మాట్లాడితే మారణాయుధాలతో, ఉన్మాదకరమయిన దాడులతో స్పందిస్తున్న మతవాదుల్ని చూస్తూ ఆనాటి వ్యవస్థలో మతానికి వ్యతిరేకంగా పోరాడిన వారికి పట్టిన దుర్గతిని తేలిగ్గానే ఊహించొచ్చు. మతమనే ప్రాధమిక వ్యాధి మానవాళిని ఈనాటికీ పీడిస్తోంది. వారసత్వంగా చలామణీ అయిన అత్యధికశాతం మంది అభిప్రాయాల్నే ప్రశ్నించకుండా పాటించడం మతం నేర్పుతుంది. అదే సత్యమనీ, నిత్యమనీ బుకాయిస్తుంది. "Truth in matters of religion, is simply the opinion that has survived" అంటాడు వైల్డ్.

మామూలుగా ఒక వ్యక్తికి మరుపులాంటి లేదా లేనిదున్నట్లు ఊహించుకుని ప్రవర్తించే లక్షణాలుంటే వెంటనే జాగ్రత్తపడి అతడి రోగనిర్ధారణ కోసం వైద్యుల్ని సంప్రదిస్తాం. కానీ సమాజంలో ఇన్ని కోట్లమంది మతమనే అతి ప్రమాదకరమయిన రోగంతో బాధపడుతూ నిత్యం ఎంతో శ్రమనీ – ఎన్నో వనరుల్ని వ్యయిస్తున్నా అందులోంచి బయటపడేసే ప్రయత్నం చేయం. "When one person suffers from a delusion, it is called insanity. When many people suffer from a delusion it is called Religion" అంటాడోవేత్త. ఈ మతమనే భయంకరమయిన వ్యాధి సమాజంలో ఎంతగా ముదిరిపోయిందంటే, ఈరోజు అత్యధిక శాతం దేశాల్లో మత రాజకీయాలే నడుస్తున్నాయి. మత విశ్వాసాల ప్రాతిపదికనే మనుషుల్ని విభజించి పాలించడమనేది రూపుదిద్దుకుంది. ప్రపంచ వ్యాప్తంగా మతం పేరిట జరుగుతున్న వ్యాపారం, దోపిడీలు నిరంతరం కొనసాగాలంటే ప్రజల్లో ప్రశ్నించే తత్వం అసలు పెరగనివ్వకూడదు. అందుకే, "The world holds two classes of men - intelligent men without religion, and religious men without intelligence" అంటారో పెద్దాయన. ముఖ్యంగా, మన దేశంలో మతకల్లోలాలకి కొదవలేదు. మనుషులకంటే, వారి సమస్యల కంటే దేవుళ్ళూ, వారి మతాలు, వాటికి సంబంధించిన తగాదాలే ప్రధానంగా గల ప్రదేశం మనది. మతం పేరుచెప్పి ఓట్లు దండుకోవడం, కోట్లు కూడబెట్టుకోవడం, మనుషుల్ని క్రూరంగా వేటాడ్డం, మైనారిటీలమీదా – స్త్రీలమీదా అమానుషమైన దాడులకు పాల్పడ్డం ఇక్కడ సాధారణం. "religion does three things quite effictively; Divides people, controls people, deludes people" అనే మాటలు పచ్చి నిజాలు. ఇంత జరుగుతున్నా తమ వివేకాన్ని

కనీసంగానయినా ఉపయోగించకుండా రోజువారీ తర్జన భర్జనల్లో మునిగితేలేలా తర్ఫీదు చేయబడ్డారిక్కడి ప్రజలు. నాయకుల నక్కవేషాలకి మోసపోమనే భ్రమలో మరింత మోసపోతూ ప్రజాస్వామ్యం పేరిట తమను తామే దిగజార్చుకుంటున్నారు. అందుకే Democracy is also a form of worship. It is the worship Jackals by Jackasses అంటాడు మెన్కెన్. వివేక సంకల్పాలకి సామాన్యులెవరూ పని కల్పించరాదనే ఉద్దేశంతోనే ఈ దేశపు మతాధిపతులు, రాజకీయ నాయకులు సామాజిక ఆలోచనా క్రమాన్ని సైతం శక్తివంతమయిన ప్రసారమాధ్యమాల ద్వారా నియంత్రించే ప్రయత్నం చేస్తారు. "He that will not reason is a bigot; he that cannot reason is a fool; he that dares not reason is a slave" అంటాడు డ్రమన్డ్. లోకంలోని జనావళి అంతా, సాధారణంగా నమ్ముతున్నాం కాన నమ్మేవన్నీ నిజాలైపోవు. అలౌకికమయిన ఆలోచనలన్నీ ఆధారరహిత అవాస్తవాలే. భౌతికవాద తాత్వికోద్యమం ఎప్పుడయితే వ్యవస్థలో కుంటుపడిందో అప్పుడిక ఈ అవకాశవాదాల భావజాలపు బాదుడు కార్యక్రమం పుంజుకుంది. "Just because you believe in something that does not mean that is true" అన్న ప్రముఖ శాస్త్రవేత్త ఐన్‌స్టీన్, "Blind belief in authority is the greatest enemy of truth" అన్నాడు. మానవాళి మతంచేత సంస్కరించబడటమనేది దాదాపు అసంభవం. అసలు మతం యొక్క చరిత్ర తెలిసినవారెవరైనా మనిషిని మతం సంస్కరిస్తుందంటే నవ్వుతారు. ఎప్పుడో-ఎక్కడో జరిగిన ఒకట్రెండు సంఘటనల్ని ఉదాహరణలుగా చూపించి మానవాళికి మతమే గతని చెప్పడమంత వికారం మరోటి లేదు. "Religion can never reform mankind, because religion is slavery" అంటాడు ఇంగర్‌సోల్. అసలీ సంస్కరణనే భావన మతానికి లేని మంచితనాన్నీ, పవిత్రతనూ అంటకట్టడం వల్లొచ్చింది. దేవుడిలాగానే మతం కూడా మనిషిచేత నిర్మించబడిందే. మతాలేవీ శూన్యంలోంచి మొదలవలేదు. మతం మానవ నిర్మితం. "All religions have been made by men" అంటాడు నెపోలియన్. కాబట్టి మతమనేదాన్ని ఒదిలించుకోకుండా మానవాళి ప్రాపంచికాభివృద్ధి సాధ్యపడదు.



# 3. హేతువాదం సిద్ధాంతం ఎందుక్కాదు?

The Annals of the French revolution prove that the knowledge of the few cannot counteract the ignorance of many... the light of philosophy, when it is confined to a small minority, points out the possessors as the victims rather than the illuminators of the multitude.

***–Samuel Taylor Coleridge, 1850, Essays on his own times.***

సమాజహితం కోసం ప్రతిపాదించబడిన భావాలన్నీ ప్రామాణికమయిన సిద్ధాంతాలు కానవసరం లేదు. అలా కావు కూడా. ఆయా కాలమానాలకు అనుగుణంగా సామాజిక పరిస్థితుల్ని వ్యవస్థ స్వరూపంతో బేరీజు వేసుకునే ప్రగతిగాముకులు తమ అభిప్రాయాలతో వారు సరైనవని అనుకున్న భావాల్ని అనుసంధానించుకుని ముందుకు సాగిపోతారు. అంతమాత్రంలో వారి నిజాయితీని అనుమానించడం మనలోని నైచ్యానికి ప్రతీకవుతుందే కాని ఔన్నత్యానికి కాదు.

హేతువాదం అనేది వ్యక్తిగత జీవన విధానానికి సంబంధించిన విషయమే తప్ప వ్యక్తుల నిర్వచనాలకులోబడే సిద్ధాంతమని నేననుకోవడం లేదు. అటువంటి సిద్ధాంతంగా హేతువాదాన్ని గుదిగుచ్చడం మంచిదని భావించడమూ లేదు. హేతువాద ఆలోచనా రీతుల్ని పరిచయం చేసేందుకు అవసరమయిన వైజ్ఞానిక, దార్శనిక దృక్పథాన్నీ, ప్రశ్నించే విమర్శనాత్మక దృక్కోణాన్ని ప్రజలకి తెలియజేసే ప్రయత్నానికి బదులు హేతువాదానిక్కూడా ఒక గుదిబండ భావజాలాన్ని తగిలించడానికి ప్రయత్నించడం సబబు కాదు.

దార్శనిక దృష్టిగల భావజాల వ్యాప్తికి సూత్రీకరణల అవసరం లేదు. ఎప్పటి కప్పుడు ఆధునిక విజ్ఞానసారాన్ని అందుకుంటూ, భావజాలంలో అవసరమయిన మార్పులు చేసుకుంటూ, తదనుగుణమయిన ఆలోచనకు – ఆచరణకు ప్రాధాన్యత నిస్తూ ముందుకు సాగడం హేతువాదుల కుండాల్సిన లక్షణం. ఇది ముందుగానే సిద్ధం చేసుకున్న సిద్ధాంత చట్రంలో ఇమిడే లక్షణం కాదు. అలా బలవంతంగా భావజాలంలో ఇమడ్చబడిన సిద్ధాంతాలన్నీ ఈసరికే మనిషిలో మతోన్మాదానికి సమానమయిన భావనియంతృత్వాన్ని ప్రవేశపెడుతున్నాయి.

హేతువాదం ఏ వ్యక్తికావ్యక్తి నిబద్ధతతో కూడిన ఆంతరిక వ్యాయామం ద్వారా స్వయంగా గ్రహించవలసిన వివేకవంతమయిన ఆలోచనాసరళికి సంబంధించిన వివేచనా పూర్వక జీవన విధానమే కాని నిర్వచనాలకి పరిమితమయిన భావజాలం

కాదు. అందుకే బ్రిటిష్ రేషనలిస్ట్ సంఘం హేతువాదాన్ని, "Rationalism may be defined as the mental attitude which unreservedly accepts the supramacy of reason and aims at establishing a system of philosophy and ethics virifiable by experiance and independent of all arbitary assumtions or authority" అని నిర్వచించింది.

చరిత్రలో హేతువాదం ఎన్నడూ ఒక సిద్ధాంతంగా లేదు. మానవ జీవన క్రమాన్ని సుసంపన్నం చేయడానికి జీవితాంతం తపించిన వ్యక్తులు హేతువాద వైఖరిని వ్యవస్థలో ప్రచారం చేయడానికి ప్రయత్నించారే కాని శాస్త్రీయ ఆలోచనారీతికి తమ కందూతిని కలిపి సిద్ధాంతంగా చెక్కడానికి తహతహలాడలేదు. మౌలికంగా సిద్ధాంతమనేది వ్యవస్థిత నియమావళికి సంబంధించిన ప్రతిపాదిత సూత్రాలపై ఆధారపడి ఉంటుంది. నిబద్ధత కలిగిన ఆలోచనాస్వేచ్ఛను ఆహ్వానించే స్వభావం వ్యవస్తీకృత సిద్ధాంతాలకుండదు. ఈనాటి మతాలన్నీ ఒకనాడు మనిషి స్థాపించిన సిద్ధాంతాలే. మత ప్రవక్తలందరూ ఆనాటి సాంఘిక సిద్ధాంతకర్తలే.

సమీకరించబడిన జ్ఞానాన్ని ఒక క్రమపద్ధతిలో వ్యవస్థీకరిస్తే సిద్ధాంతమవుతుంది. కాబట్టి సిద్ధాంతమనేది కూర్చబడిన ఆలోచనల సమూహమే తప్ప వేరుకాదు. ఇలా ఎంచుకున్న భావాలన్నీ సాధారణంగా వంతపాడటానికి సాయపడగలవేకాని సొంతంగా వ్యవహరించే ధైర్యం చేయలేవు. భావజాల స్వేచ్ఛకి పరిమితులు విధించుకుని, ఎంచుకోబడిన ఆలోచనల్ని భుజాన మోస్తూ ఏదోక స్థితిని లక్ష్యంగా చేసుకుని కాల్పనిక గాథల్లోని కథానాయకులవలె ముందుకెళ్ళడం భావవిప్లవోద్యమాల్లో సాధ్యం కాదు. ఆలోచనోద్యమాలనేవి వ్యక్తుల భావాల్లో మార్పు తీసుకొచ్చే బృహత్తర బాధ్యతను చేపట్టాల్సినవి. వాస్తవిక దృష్టిపై ఆదారపడి మాత్రమే భావవిప్లవోద్యమాల ప్రణాళిక రూపొందించడం సాధ్యమవుతుంది.

వ్యక్తుల్ని చైతన్యపరచడం ద్వారానే వ్యవస్థలో ఎటువంటి మార్పులయినా సంభవించాయి కాని, సిద్ధాంతాలు చేయడం ద్వారా కాదు. అడపాదడపా అదుపు తప్పిన సిద్ధాంతోద్రేకం మనుషుల్ని ఉన్మాదులుగా మలిచిన ఘటనలున్నాయి కాని స్వతంత్రులుగా మార్చిన సంఘటనలు అరుదు. ఒక నిర్దిష్టమైన ఆలోచనాక్రమాన్ని కొన్ని నిర్ణీతమయిన పరిమితులకు కుదించడం ఏ సిద్ధాంత రూపకల్పనలోనయినా





ప్రధాన భాగం. అలా కుదించబడిన ఆలోచనలు, అవెంత అభ్యుదయకరమైనవయినా నిర్దేశితమయిన సైద్ధాంతిక చట్రానికి లొంగివుంటూ బయటికి తొంగి చూడవలసిందే కాని స్వేచ్ఛగా మసిలే వీలుండదు.

అందుకే "హేతువాదాన్ని ఒక సిద్ధాంతంగా, పిడివాదంగా రూపొందించి మనుషులపై ముద్ర వేసుకుంటూ పోతే ఈ ఉద్యమం యొక్క లక్ష్యసిద్ధి విఫలమయ్యే ప్రమాదం వుంది. హేతుదృష్టి మనిషిలో అంతర్భాగం. అది ప్రత్యేకించి ఒకరు బోధిస్తే అలవడేది కాదు. అది ఒక ఆలోచనా వైఖరి. సహేతుకమైన ఆలోచనా వైఖరికల వ్యక్తిపై హేతువాది అనే ముద్ర లేకపోయినా అతడు హేతువాదే. హేతువాద ఉద్యమం నిర్వహించవలసింది సహేతుకమయిన ఆలోచనను ప్రేరేపించటమే తప్ప, నిర్దేశించటం కాదు. సహేతుకమయిన ఆలోచన ఒక్క మతాచారాలను ఖండించడానికే కాక మానవ జీవిత సమస్యలన్నింటికీ తోడ్పడాలి. అందులో ముఖ్యమైనది ఈనాడు మానవుడు కోల్పోయిన మానవతను తిరిగి నిలబెట్టడం. మానవతా దృష్టికల వ్యక్తి మతంలో నమ్మకం కలవాడైనా, కాకపోయినా మహోన్నతుడే" అంటారు ఎస్.ఎస్. లక్ష్మి.

"The average man never really thinks from end to end of his life. The mental activity of such people is only a mounthing of cliches. What they mistake for thought is simply a repetition of what they have heard. My guess is that well over 80 percent of the human race goes through life without having a single orginal thought." అంటాడు M.L. Menchen. అనాదిగా ఆలోచించడమనే బృహత్కార్యాన్ని అరుదుగానైనా మానవాళి నిర్వర్తిస్తూనే వస్తోంది. అందుకే చరిత్ర పురోగమిస్తోంది. "హేతువాదబద్ధమైన తత్వం సామాన్య జ్ఞానసూత్రమైన తత్వం కన్న మిన్న – దార్శనిక పద్ధతులలో మీమాంసలో అనుభవ వ్యక్తీకరణలో తగినంత నిశ్చయ జ్ఞానాన్ని ప్రదర్శించడానికి హేతువాదం అవసరం. అది లేనప్పుడు సామాన్య జ్ఞానమాత్రమైన తత్వం తగినంత నిశ్చయజ్ఞానాన్ని వ్యక్తం చేయలేదు" అంటారు గురజాడ అప్పారావు.

ఆధునిక శాస్త్రవిజ్ఞానం నుంచి భౌతిక భోగలాలసత్వాన్ని స్వీకరించినంతగా బౌద్ధిక నైతిక విలువల్ని సమాజం స్వీకరించలేదు. అందుకే, వాళ్ళు చేసే అనైతిక కార్యకలాపాలకి అధికారిక ఆమోదం కోసం అప్రయత్నంగానే ఆస్తికత్వాన్ని ఆశ్రయించడానికి అలవాటు పడుతున్నారు జనం. దానికి పరోక్షంగా వంతపాడుతూ

భౌతికవాదం అధోగతి పాలవలేదని బాధపడే భక్తులందరూ అప్పుడప్పుడు దాడి చేస్తుంటారు. అంతమాత్రానికే లౌకికోద్యమాలు లొంగిపోతాయని తొంగిచూసే దొంగలకు ఎప్పటికీ నిరాశే మిగులుతుంది. మనిషిలోని వివేక సంకల్పాలు సరిగా పనిచేస్తున్నంత కాలం ప్రాకృతిక హేతుత్వం అతడికి అవగతమౌతుంటుంది.

ఇక హేతువాద ప్రచారోద్యమాలకి సరిపడినంత సాహిత్యం అందుబాటులో లేదని ఈ మధ్య కొంతమంది పనిగట్టుకుని బాధపడటం రివాజయింది. ఎక్కడా ఎలాటి ప్రగతిశీల ప్రయత్నాలు జరగటం లేదని వీలైనప్పుడల్లా విచారించడాన్నే సాంఘిక దృక్పథంగా భావించడం జరుగుతోంది. ఈ వాదన కూడా నా వరకు నాకు సమ్మతం కాదు. మొదటిది, ప్రపంచంలోని అనేక ఇతర దేశాలకంటే మన దేశంలోనూ, మనదేశంలోని ఇతర రాష్ట్రాలకంటే మన రాష్ట్రంలోను శాస్త్రీయ సాహిత్యం బాగానే అందుబాటులోనే ఉంది. ప్రగతిశీల భావజాలాన్ని సమర్థించే భిన్న ఆలోచనా ధోరణులకి చెందిన సంస్థలు అందుబాటులో ఉన్న మానవ వనరుల్నీ, ఆర్థిక వనరుల్ని సమన్వయం చేసుకుంటూ పరిమితులతో కూడిన ప్రచారోద్యమాన్ని నిర్వహిస్తున్నాయి.

కుదిరితే అలా నిజాయితీగా పాటుపడుతున్న ప్రగతికర సంఘాల చైతన్యయుత సాహిత్యాన్ని, ప్రజా ప్రచురణల్ని వ్యాప్తిచేసే నిర్మాణంపై దృష్టి పెట్టడం భావ వికాసోద్యమాలకి దోహదం చేసే సమష్టి కార్యాచరణను కాంక్షించే కార్యకర్తల బాధ్యత కావాలే కాని ఏకరూప భావజాలంతో ప్రామాణిక గ్రంధాల్ని కూర్చొని కూర్చడానికి హేతువాదం మతగ్రంథం కాదు. "Man is essentially a rational being. His basic urge is not to believe, but to question, to know" అంటాడు ఎమ్.ఎన్. రాయ్. మానసిక జిజ్ఞాసకి తృప్తనేది ఉండదు. ప్రశ్నించడమనేది మనిషి స్వభావంలో అంతర్లీనంగా ద్యోతకమవుతూ ఉంటుంది.

అందుకు నిర్దిష్టమయిన నియమావళిని ఏతరానికాతరం రూపొందించుకుంటూనే ఉంటుంది. అయితే, పూర్వతరం నుంచి తప్పనిసరిగా సంక్రమింపజేసుకోవాలన్న నిబంధనేదీ తర్వాతి తరానికి ఉండదు. జ్ఞానం అల్పమూ, అధికమూ తప్పితే శూన్యమూ, సంపూర్ణమూ ఉండవు. కాబట్టి, మన తరంలో మన వంతు జ్ఞానాన్ని ఎంత హేతుబద్ధంగా తర్వాతి తరానికి అందిస్తున్నామనేదే ముఖ్యం. "Believe nothing; No matter where you read it, or who said it. No matter if I have said it. Unless it agrees with your own reason and your own common sence." అంటాడు బుద్ధుడు.

ఆలోచనోద్యమాలనేవి శుద్ధ ఆందోళనోద్యమాల వంటివి కావు. మౌలికంగా వ్యక్తుల అంతరాత్మల్లో మార్పు తీసుకురాకుండా భావ విప్లవోద్యమాల బాధ్యత నెరవేరదు. వైజ్ఞానికంగా ప్రశ్నించడానికీ, వివేకంగా ప్రవర్తించడానికీ సిద్ధాంతాలక్కర్లేదు. అందుకే, హేతువాదాన్ని ఒక సిద్ధాంతంగా మలిచే ప్రయత్నం కంటే కూడా ఒక ఆరోగ్యవంతమయిన మానసిక దృక్పథంగా ఉంచడమే మంచిదని నా అభిప్రాయం. 'ఇండియన్ రినైజాన్స్ ఇనిస్టిట్యూట్'ని స్థాపిస్తున్నప్పుడు ఎమ్.ఎన్. రాయ్, "I am occupying myself with philosophical and historical writings, as founder - Director of the Indian Renaissance Institute, which is cultural educational organization founded with the object of re-educating the educators and young intellectuals of India in the spirit and with the ideas of Radical (or integral) Humanism" అంటాడు.

పునరుత్పత్తి పొందని జాతి అంతరించి పోతుందనేది శాస్త్రీయ సత్యం. సమాజంలో వివేకవంతుల సంఖ్య తగ్గిపోతోంది. వివేచనాపరుల స్థాయి రోజురోజుకీ పడిపోతోంది. ఆలోచనాపరుడికి వుండవలసిన ముఖ్యమయిన లక్ష్యం వీలయినంత మంది ఆలోచనాపరులను తయారుచేయడమే. కుదిరినంతమందిలో వివేచనాత్మక విశ్లేషణను గూర్చి అవగాహన కల్పించడమే. హేతుబద్ధాలోచననీ, తర్కబుద్ధినీ, శాస్త్రీయ దృక్పథాన్ని శీలవంతమయిన ఉన్నత వ్యక్తిత్వం ద్వారా సమాజంలో పాదుగొల్పడానికి ప్రయత్నించడమే. ఇంకా కచ్చితంగా చెప్పాలంటే, ఈ విషయంలో సిద్ధాంతాలు అవసరమా కాదా అనే అంశంపై రాద్ధాంతాలు చేసుకోవడం కంటే కూడా ఇరుపక్షాలు కలిసి చర్చించుకుంటూనే కార్యక్షేత్ర ప్రణాళిక రూపొందించుకోడం మంచిదని నా అభిప్రాయం. ఇక సిద్ధాంతాల కోసమూ, వాటి ప్రచారం కోసం సర్వాంగికార భాషని పేర్చుకునే వాదనొకటుంది.

భావ వికాసోద్యమాలన్నీ భాష ప్రధానంగా ముందుకు సాగేవే. ఏ తరహా ప్రచారోద్యమానికైనా భాష ఒక ముఖ్య భూమిక. అయితే, ప్రచారోద్యమాలకిగాను ప్రత్యేకమైన భాషంటూ ఏదీ లేదు. కుదిరినంత సూటిగా, స్పష్టంగా, సరళంగా, సహజంగా ప్రసార యోగ్యమయిన భాషని సమయ సందర్భాల్ని అనుసరించి ప్రయోగించడం వివేకం. చరిత్రలో ఉన్నతమయిన భావజాలం కోసం జరిగిన ప్రయత్నాలన్నీ కూడా చాలావరకూ, తొంబై తొమ్మిది శాతం మందికి సాధారణంగా

స్ఫురించే అర్థాలు గల పదాలతో, వాక్యాలతో కూర్చబడినవే కాని భావవికాసోద్యమాలకి గాను, ఒక కొత్త భాష కోసం పనిగట్టుకుని పాత పదాలకి పూత అర్థాల్ని, నూతన వాక్యాలకి ఊత వాక్కుల్ని చేర్చుకున్నవి కావు.

మన స్వభావాల్లోని లోపాల్ని అంగీకరించడానికి ముందుకు రాని అహంకారం, అప్పుడప్పుడూ మన చేత కొత్త భావాల్ని ప్రతిపాదిస్తున్నామనే భ్రమల్ని కల్పించవచ్చు. అయితే, ఆచరణలో చారిత్రకంగా వాటి స్థానం ఏంటన్నది మదింపు వేయాల్సి వుంది. కారణమేదయినా సాంఘిక పురోగతిలో భాగంకాని సమాలోచనలు, అవెంత ఉన్నతమైనవైనా ఒట్టిగానే మిగిలిపోతాయి. ఒక వ్యక్తినో సంస్థనో ఆధారం చేసుకొని సమాజాన్ని సంస్కరించేదో, ఒక నిర్ధిష్టమైన భావజాలాన్ని ప్రసరింపజేసేదో మాత్రమే ఉద్యమమనే భావనే సంకుచితమైంది.. స్పందనిచ్చినంత స్పష్టత స్తబ్దతివ్వదు. ఆచరణ అందించే స్ఫూర్తి ఆలోచనతో రాదు. అందుకే సైద్ధాంతిక చర్చల కంటేకూడా కార్యాచరణ క్షేత్రాలే అవసరమని నేననుకుంటున్నాను. భావజాల క్షేత్రంలో కొద్దిపాటి విబేధాలున్నప్పటికీ, ఆచరణా రూపాలలో కొంతమేరకు వివాదాలున్నప్పటికీ, సమాజహితం కోసం పాటుపడ్డానికి సిద్ధపడినవారితో కలిసి పనిచేయడానికి నాకే విధమయిన అభ్యంతరాలూ లేవు. అంతిమంగా మన లక్ష్యాలు సారూప్యంగా ఉన్నప్పుడు లక్ష్యసాధనా క్రమంలోకల మార్గాలలోని వైరుధ్యాలు ప్రాముఖ్యత నిచ్చేంతటి ప్రాధాన్యతకల స్పర్థలు కానక్కర్లేదనేదే నా భావం. శుభం.

"Men fear thought as they fear nothing else on earth-more than ruin-more even than death .... Thought is subversive and revolutionary, destructive and terrible, thought is merciless to privilege, established institutions, and comfortable habit. Thought looks into the pit of hell and is not afraid. Thought is great and swift and free, the light of the world, and the chief glory of man."

***– Bertrand Russel.***





# 4. మతం – శాస్త్రం – సమాజం

"Religion is an insult to human dignity. With or without it, you'd have good people doing good things and evil people do evil things. But for good people to do evil things, it takes religion" అంటాడు స్టీవెన్. సగటు మనిషిలోని అజ్ఞానాన్ని భద్రంగా తన స్వార్థం కోసం వుపయోగించుకునే పరమ పరాన్న వ్యవస్థలు మతరాజ్యాలు. మానవ సమాజం యావత్తూ ఎన్ని ఒడిదుడుకుల్లోనైనా గ్రహించవలసిన విషయం మతాల్లో మంచినీ, రాజ్యంలో శాంతినీ వెతకడం వ్యర్థమని. శుద్ధ శ్రేయోరాజ్యాలనేవేవీ ఉండవు. అయినా బానిసత్వంలో ఆనందం వెతుక్కునే వారికి చూసేందుకు మతరాజ్యాల్లో పెద్దగా ఏమీ కనబడవు. "None are more hopelessly enslaved than those who falsely believe they are free" అంటాడొకాయన. తమకు తామే స్వతంత్రులమని గంతులు వేయడం వలన వొరిగేదేదీ వుండదు. అలవాటయిన అణిచివేతకి అందంగా ఎన్ని ముద్దుపేర్లు పెట్టుకున్నా ఒకటే. సారంలో అసమానతలు తాండవిస్తున్న వ్యవస్థని అక్షరాల కోసం అందంగా ముస్తాబుచేసి అక్రమార్కులతో పక్కెక్కించడం సరికాదు. "When we blindly adopt a religion, a political system, a literary dogma, we become automatous" అంటారు Anais Nin. అందుకే భౌతికవాదాన్ని వ్యక్తిత్వంలో వృద్ధి చేసుకోకుండా ఏదో తోచిన మంచి చేయడానికి తగుదునంటూ తయారవడం వివేకం కాదు. మూఢత్వాన్ని పెంపొందించే మతం అలాగే ఉన్నంతవరకూ, సంఘంలో సక్రమాలోచననేది సాధ్యం కాదు. సక్రమాలోచనాపరుల్ని తయారుచేయకుండా అక్రమాలు అరికట్టడం సాధ్యంకాదు. "We need men with moral courage to speak and write their real thoughts, and to stand by their convictions, even to the very death" అంటాడోవేత్త. రుద్దుతున్న భావజాలాన్ని నోర్మూసుకుని రుద్దించుకోవడం ప్రజాస్వామ్యం కాదు. సమాజంలో తిరోగమన భావజాలానికి ఆ పద్ధతి అద్దం పడుతుంది. It is the rare fortune of these days that one may think what one likes and say what one thinks" అంటాడు Tacitus. సమాజం మారాలీ మారాలంటూ మార్పువాదులు చేసే గోల అసలు వారిలో మారటానికి ఎంతశాతం సిద్ధంగా ఉన్నారన్న సంగతిని మరుగుపర్చడానికే కాని మరెందుకూ కాదు. మారువేషంలోనున్న మాయదారి రాజకీయ

పార్టీలు కొత్తరంగులు పులుముకుంటూ డ్రామాలకి సిద్ధమౌతున్నప్పుడు, 'ఎవరి సౌకర్యం వారు చూసుకునే దేశంలో చట్టాలు అనాథ పిల్లల్లాంటి'వని పతంజలి భాష్యం చెప్పినా, "The only real radicalism in our timewill come as it always has - from people who insist on thinking for themselves and who reject party-mindedness" అని క్రిస్టోఫర్ హిచెన్స్ అన్నా మనకి అర్థం కావాల్సిందొకటే. "ప్రజాస్వామ్యమంటే చట్ట సభల బిల్డింగులు కాదు. ప్రజాస్వామ్యమంటే ప్రజాస్వామ్య వ్యవస్థలు ఎంత రెచ్చగొట్టినా అవి చెక్కు చెదరకుండా తమ విలువలకు కట్టుబడి వుంటాయని రుజువు చేయడం అత్యుత్తమ సేవ" అంటాడు బాలగోపాల్. అటువంటి ఉన్నతమయిన వ్యవస్థ దిశగా నడవడమే ఏ రకమయిన భావజాల లక్ష్యమైనా.

అందుకే అసలు ఏ భావజాలాన్ని ప్రజాస్వామికంగా ప్రచారం చేయదలుచుకున్నా దానికి భౌతికవాదన్నీ, మానవవాదాన్ని ప్రాతిపదికగా పెట్టుకోవాలి.. బాల్యం నుంచే ఈ విధమయిన వైఖరిని అలవాటు చేసే ప్రయత్నం నిజాయితీగా చేయడమే సమాజానికి గాని దేశానికి గాని వైజ్ఞానిక స్పృహకల ఒక ఉద్యమ కార్యకర్త చేయదగ్గ నిజమైన కార్యక్రమం. యుద్ధంలో ఎటువైపు ఉంటామో తెలుసుకోడానికి పుస్తకాలు చదవక్కర్లేదంటాడు మైకోవిస్కీ. మతం పేరిట ఈ రోజు అమలౌతున్న అమానవీయ దుర్మార్గాల్ని ప్రశ్నించడానికి ప్రత్యేకమయిన బిరుదులక్కర్లేదు. మన దేశపు రాజ్యాంగంలో లౌకికవాదమనే దాని స్వరూపాన్ని అర్థం చేసుకోకుండా ఈ విషయం అర్థం కాదు. "సెక్యులరిజమ్ ఒక కల్లోలానికి మరో కల్లోలానికి మధ్య ఎవరూ పట్టించుకోని కాయితపు శాంతి తీర్మానం అయిపోయింది. చరిత్రలోను, వర్తమాన రాజకీయార్థిక వ్యవస్థలోనూ ఏ పునాదీలేని బలహీనమయిన భావనగా సెక్యులరిజమ్ తనను తాను బహిర్గతం చేసుకుందం"టాడు సి.వి. సుబ్బారావు. ఒక భావజాలంగానే సెక్యులరిజమ్ ఇలా వుంటే ఇక ఆచరణలో ఈ భావన మన నాయకులకు ఎంతగా స్ఫూర్తినందిస్తుందో తేలిగ్గానే గ్రహించొచ్చు. ఈ దేశంలోని మత కల్లోలాల్లో మరణించినవారికి సంతాపం ప్రకటించడం మాత్రమే మన నాయకులు చేయగల్గింది. ఏ.కె. రాయ్ అన్నట్లు "ప్రజలు పిట్టల్లా చచ్చిపోతుంటే సంతాపం ప్రకటించే స్థలం ఈ పార్లమెంటు. ప్రతిసారీ అవే ఆరోపణల్ని పరస్పరం విసురుకునే బజారు." "It is a thousand times better to have common sense without education than to have education without common sense" అంటాడు ఇంగర్‌సోల్. అలాగే, "The great aim of education is not knowledge but action" అంటాడు హెర్బర్ట్ స్పెన్సర్. మతాలకీ, విశ్వాసాలకీ సంబంధించిన సశాస్త్రీయ భౌతికవాద దృక్పథాన్ని ప్రజల్లో పెంపొందించకుండా ఈ సమస్య పరిష్కారం కాదు. ప్రజాతంత్ర ఉద్యమాల్ని కుదిరినంత బలహీనపరచడమే లక్ష్యంగా తిరోగామి శక్తులన్నీ కలసికట్టుగా పనిచేస్తున్న ఈ ప్రమాదకరమయిన సందర్భంలో ఆ మతాలకి వ్యతిరేకంగా భౌతికవాద భావవికాసోద్యమంలో కృషి చేయడానికి గానూ ప్రజాతంత్రవాదులంతా ఐక్యం అవ్వాల్సిన అవసరముంది. "ఏ దేవుడూ సృష్టించని ఈ ప్రపంచంలో న్యాయమే గెలిచి తీరుతుందన్న భరోసా ఏమీ లేదు కాబట్టి సిగ్గూ ఎగ్గూ లేని రాజకీయ నీతి ఫలించగలదంటా"డు బాలగోపాల్. కాబట్టి మనుషుల్లో మానసిక పక్వతని సరైన రీతిలో పెంచుతూ వ్యవస్థ అభ్యుదయం కోసం వారికి మేలైన మార్గం సూచించడం క్షేమకరం. సమాజంలోని వేరే అన్ని సమస్యల్ని గాలికొదిలి భౌతికవాదాన్ని గురించి యాంత్రికంగా సూత్రీకరణలు చేయడం కూడా సరికాదు. వ్యవస్థలోని అసమానతలకి సమాధానం వెతక్కుండా అందరికీ ఏదో మంచి చేద్దామనుకోవడం వో రకమైన పిచ్చితనం. "నిరాశతో క్షణానికోసారి మానసికంగా ఛస్తూ వుండు, ఆశల ఇంద్రధనస్సులను సృష్టించి, వాటితో కోర్కెల నక్షత్రాల్ని ఒక్కొక్కటిగా నేలరాలుస్తూ వుండు. చివరికి నిన్ను నేలమీదికి నిజం కత్తిదారుమీదికి లాక్కొచ్చి నిలబెట్టేది ఆకలి." అంటాడు పతంజలి పదిపైసలనే కథలో. "దారిద్ర్యం కుష్టు లాంటిది. దానితో బాధపడుతున్నవార్ని చూసినపుడు యితరులకి జాలికంటే ముందు జుగుప్స కలుగుతుంది. భయం కలుగుతుంది. వారు ఎదురుపడినప్పుడు వెంటనే అక్కడి నుంచి తప్పుకోవాలనిపిస్తుందం"టాడు నగ్నముని. "అప్పటికీ ఇప్పటికీ కూడా నాకు కుష్టురోగాన్ని చూస్తే ఎంత భయమో దారిద్ర్యం అంటే అంత భయం" అంటాడు రావిశాస్త్రి 'ఎందుకు రాసేను?' లో. మనం ఎందుకు రాస్తున్నామో గ్రహించేంత విజ్ఞత వుంటే ఇదంతా ఎందుకు చేస్తున్నామనే ప్రశ్నకి జవాబు దొరుకుతుంది. "A greatman is different from an eminent one in that he is ready to be the servant of the society" అంటాడంబేద్కర్. కాబట్టి, ఏర్పర్చుకునే ఆలోచనా రీతులతో వ్యవస్థ స్వరూపాన్ని మార్చడానికి మనవంతు ప్రయత్నాల్ని నిజాయితీగా చేయడమే మన కర్తవ్యం. భౌతికవాద ప్రాపంచిక దృక్పథాన్ని ధరించి సమస్యల్ని విశ్లేషించడంతో బాటు వాటికి పరిష్కారం కూడా శాస్త్రీయంగా శోధించే యత్నం చేయడం మన విధి. అతీత శక్తుల భావజాలంతో అమాయక జనాల్ని మోసంచేసే

జలగలకు, దోపిడీవాదులకు భౌతికవాదులు సింహస్వప్నం కావాలి. ఈ దేశంలో అత్యధిక శాతం మంది కష్టజీవులందరిపైనా క్రూరమైన అణిచివేత అమలవుతూనే వుంది. ఇక్కడ దేవుళ్ళూ, దేవతలు కూడా కులాలకతీతంగా ఉండలేరు. "Gods always behave like the people who created them" అన్న పదాలకి బీసెంటన్నట్లు "you know your god is man-made when he hates all the same people you do" అన్న మాటలు సరిగా సరిపోతాయి. ఈ విధమయిన రీతులు భారతదేశంలో మరింత అధికం. అణగారిన జనాల మానసిక బలహీనతలపై ఆధారపడి మాత్రమే భారతీయ సాంప్రదాయం, సంస్కృతీ, మనగలుగుతాయి. సామాన్య ప్రజలకి అందని ద్రాక్షగా మిగిలిన 'సమానత్వం' రాజ్యాంగ శాసనానికి అలంకారప్రాయంగా నాయకుల ఉపన్యాసాలకి ఊతపదంగా ఉపయోగపడుతోంది తప్పితే మరెందుకూ పనికిరావడం లేదు. గ్రామీణ ప్రాంతపు ప్రజానీకంలో అతీత శక్తుల గురించిన భావనలు అధికమవ్వడం ప్రజాతంత్ర విలువలకు ఒక ప్రమాద సంకేతం. ఆదివాసుల్ని, గిరిజనుల్ని కూడా మతోన్మాద శక్తులు లొంగదీసుకుంటూ తమ పావులు ప్రణాళికా బద్ధంగా కదుపుతున్నారు. పూర్తి అసత్యం కంటే కాస్తంత నిజం కలిపిన అబద్దాలు అర్ధసత్యాలవుతాయి. అవి మరింత ప్రమాదకరమయినవి. కొత్తరంగు పులుముకున్న ప్రస్తుత మతస్థితి అలాంటిదే. "Gods are fragile things; they may be killed by a whiff of science or a dose of common sense" అంటాడు చాప్‌మెన్ కోహన్. ఈ పరిస్థితుల్లో ప్రజాసమూహాల్ని చైతన్యపరచడం మన ప్రధాన కర్తవ్యం. సాంప్రదాయ వారసత్వాల్ని నెత్తినెత్తుకునే కార్యక్రమాల్ని విడనాడేలా సామాన్య ప్రజలకి స్ఫూర్తినందించడం మన కర్తవ్యం. "Just because something is traditional is no reason to do it" అంటాడొకాయన. కాబట్టి కులమతాల్ని హైందవ కుతంత్రంలో భాగంగా తప్ప చూసే వీలులేదు. ఈ అసమానతల్ని నిర్మూలించకుండా ఏ రకమయిన ప్రజాస్వామ్య వ్యవస్థని నిర్మించుకోవడం సాధ్యం కాదు. దళిత బహుజనులంతా ఈ అంశాన్ని దృష్టిలో పెట్టుకుని భౌతికవాస్తవిక వాద తాత్విక దృక్పథాన్ని తమ కృషిలో భాగం చేసుకోవడం ద్వారానే ఏ ప్రగతికర ఉద్యమంలోనయినా భాగం కాగలరు.

భౌతిక యదార్ధవాదాన్ని ఆచరించకుండా ఏ ప్రజాతంత్ర ఉద్యమస్ఫూర్తిని కలిగించడమయినా కష్టతరం. భౌగోళిక అస్తిత్వపు అంశాలన్నీ మానవుడిలో హేతుత్వంగా ప్రతిబింబిస్తాయి. ప్రాపంచిక గుణాల్ని జ్ఞానేంద్రియాలతో గ్రహించడం ద్వారా మనిషి తన భౌతిక వాస్తవికతను గుర్తిస్తాడు. ఆ గ్రహింపే వివిధ స్థాయిల్లో జ్ఞానంగా మారుతుంది. విభిన్న వాస్తవ రూపాల్ని సారంతో సహా దర్శించి తన విజ్ఞానాన్ని విస్తరించుకోగలుగుతాడు. పరిణామాత్మకంగా అభివృద్ధి చెందే ఈ క్రమం కారణంగానే శాస్త్రం ఆవిర్భవిస్తోంది. తను సాధించిన సమాచారాన్ని జీవితరంగాల్ని మరింత సుఖవంతం చేసుకుందుకు వినియోగించగలుగుతున్నాడు మానవుడు. మనిషి ప్రాథమికంగా భౌతికవాది, తద్వారా హేతువాది. అతడి భౌతిక దృక్పథం హేతుత్వ వివేచనకు కారణం అవుతోంది. భౌతికతను విస్మరించిన బావవాదమంటూ ఏం ఉండదు. ఎంతటి భావవాదమయినా మనిషి భౌతిక చింతన ద్వారా జనించవలసిందే. మనిషి భౌతిక వాస్తవికతలోంచి జనించిన మానసిక సంఘర్షణనే తత్వశాస్త్రమంటారు. నిజానికి భావవాదంలో భక్తి తప్పితే తత్వమేమీ ఉండదు. తత్వమంటేనే తెలుసుకుందుకు చేసే యత్నం. ప్రకృతి – పురుషుల సమైక్యం. ప్రాకృతిక పదార్థామే ప్రపంచంగా జీవుల అస్తిత్వానికి తెలుస్తోంది. విశ్వంలోని పదార్థ గ్రహణే జీవులకి భౌతిక పరిసరాల్ని పరిచయం చేస్తుంది. సులభంగా చెప్పాలంటే అస్తిత్వంలోనున్న పదార్థాన్నంతట్నీ కలగలిపి మొత్తంగా విశ్వం' అంటాం. విశ్వానికి హద్దుల్లేవ్. ఈ విశ్వంలో ఒక ఘటన జరిగిననాటి నుంచి ఈనాటి దాకా సంభవిస్తున్న సంఘటనల మధ్యకల సమయాన్ని 'కాలం' అంటాం. స్థూలంగా చెప్పాలంటే కాలమంటే విశ్వచరిత్రే. స్థలకాలాల నిర్వచనాలపై ఆధారపడి మాత్రమే ఈనాటి వైజ్ఞానిక ప్రగతి పురోగమిస్తోంది. నిర్జీవం నుంచి జీవం సృష్టించడం సైన్స్ కనుగొనలేకపోయిందని ఆరోపించే అజ్ఞాతవాదులు అర్థం చేసుకోవాల్సింది శాస్త్ర పరిధి ప్రయత్నశీలమైందని. కొంతకాలానికి ముందు అసలు నిర్జీవంలోంచి జీవం ఆవిర్భవించిందన్న విషయం కూడా మనకి తెలీదు. కాబట్టి భూగోళం ఆవిర్భవించిన కొత్తలో పరిస్థితుల్ని ఊహించినప్పటికీ వాటిని యధాతథంగా తిరిగి సృష్టించడం కష్టం. ఉదాహరణకి కొండల్నీ, సముద్రాల్నీ, ఇతర ప్రకృతి వనరుల్ని సృష్టించలేం. జీవమనేది కూడా అలాంటిదే. జీవం మీదా జీవలక్షణాల మీదా అనేక ప్రయోజనాత్మకమయిన పరిశోధనలు జరుగుతున్నాయి. ఈ మధ్య జరిగిన 'దైవ (మూల) కణం' గురించిన ప్రయోగ ఫలితాల్ని ప్రపంచమంతా ఆసక్తిగా గమనించింది. శాస్త్రం ఎప్పుడూ ఈ విధంగా ముందుకు నడుస్తూనే ఉంటుంది. విజ్ఞానం ద్వారా మనిషి నిర్మించే సాంకేతికతకి తీవ్రమయిన కృషి, అంతర్మథనం, ప్రతిపాదన, నిరూపణ మొదలైనవి అవసరం. జీవం ఏర్పడ్డనాటి భౌగోళిక స్థితిని

అంచనా వేయడంలో వివిధ వాదనలున్నాయి. దానర్థం ఈ ప్రక్రియ వెనుక అతీత శక్తి వుందని కాదు. మనిషిని పుట్టించే మంత్రసాని పాత్రను పరిణామం ప్రకృతితో కల్సి తీసుకుంది కాని అందుకోసం దేవుడనేవాడేమీ దిక్కుతోచక తిరుగాడుతూ ఉండలేదు. భౌతిక వాస్తవ ప్రాపంచిక దృక్పథంతో వీక్షిస్తే ఇదంతా సులువుగా అర్థమయ్యే సంగతే. అలాకాక అతీత శక్తుల్ని గురించిన ఆసక్తితో చూస్తే అంతటా మహిమలూ, మానవాతీత శక్తులే కనిపిస్తాయి. దాన్నే "Consciously or unconsciously most theists see in gods and devils, heaven and hell, reward and punishment, a whip to last the people into obedience, meekness and contentment అంటుంది గోల్డ్‌మన్. "శాశ్వతత్వం మీది ప్రీతియే మానవ జీవితంలో అనేక బాధలను సృష్టిస్తుంది. శాశ్వతం కాని జగత్తులో శాశ్వతత్వం గురించి అన్వేషించడం చీకటిని సృష్టిస్తుంది కాని వెలుగును సృష్టించలేదం"టారు సంజీవ్‌దేవ్ ప్రొఫెసర్ పోకల లక్ష్మీ నరసు అద్భుత రచనైన 'what is Buddhism?'కి ఏటుకూరి బలరామమూర్తిగారు చేసిన 'బౌద్ధం అంటే ఏమిటి?' అనువాదానికి రాసిన ముందుమాటలో. మానవ జీవన సారాన్ని భౌతిక సార్వత్రిక జగత్తులో భాగంగా కాకుండా వీక్షించడం పాక్షిక దృష్టికి ప్రమాణం.

"The great majority of men and women in ordinary times, pass through life without ever contemplating or criticizing, as a whole, either their own conditions or those of the world at large. They find themselves born into a certain place in society, and they accept what each day brings forth without effort as thought beyond what the immediate present requires. Almost of instinctively as the beasts of the field, they seek the satisfaction of the needs of the moment. Without much forethought, and without considering that by sufficient effort the whole conditions of their lives could be changed."

**– Bertrand Russel.**





# 5. నెత్తురోడిన చైతన్యం 'నరేంద్ర దభోల్కర్'

"As to the history of the revolution, my ideas may be peculiar, perhaps singular. What do we mean by the revolution? The war? That was no part of the revolution; it was only an effect and consequence of it. The revolution was in the minds of the people, and this was effected... before a drop of blood was shed."

*– John Adams, letter to Thomas Jefferson.*

ఈ దేశంలో కొంతలో కొంత సొంతంగా ఆలోచించడం కోరి ప్రమాదాల్ని కొనితెచ్చుకోడంతో సమానం. అందుకే, ఎక్కువమంది తమ గురించి ఆలోచించే బాధ్యతను అతీతశక్తులకప్పగించి మానసిక సోమరులుగా గడిపేస్తారు. కంటికన్పించని కాల్పనిక రూపాలపై తోచినంత భారాన్ని మోపి లౌకిక వ్యవహారాలలో ఆర్థిక లౌక్యులుగా మారి ఆధ్యాత్మిక దోపిడిలో భాగమవుతారు. అవతారమూర్తుల్ని పట్టుకు వేలాడతారు.

ఆధిపత్యవర్గ ప్రయోజనాల్నుంచి మినహాయించి ఆధ్యాత్మిక మతాలకి అస్తిత్వమంటూ ప్రత్యేకంగా లేదు. అందుకే, అణగారిన వర్గాల ప్రజలకి ప్రశ్నించడం నేర్పేవారెప్పుడూ ఆధిపత్యవర్గాల వారికి బద్ధశత్రువులౌతారు. సమానత్వాన్ని కాంక్షించే వారే సమాజంలోనైనా అసమానత్వానికి ఆగర్భ శత్రువులుగానే చూడబడతారు. చైతన్య భావజాలాన్ని ఎదుర్కోలేని మతోన్మాద అల్పత్వం మనుషుల్ని భౌతికంగా నిర్మూలించేందుకే నడుం కడుతుంది.

జ్ఞానం నెత్తురోడిన వుదంతాలు చరిత్రలో చాలానే ఉన్నాయి. సాధారణంగా విజ్ఞాన ప్రవాహానికి అడ్డుకట్ట వెయ్యాలనుకునే అజ్ఞానమెప్పుడూ అఘాయిత్యానికి పాల్పడ్డానికే మొగ్గు చూపుతుంది. ఫలితంగా, అంధకారం ఆయుధాలు పట్టి అవకాశం కోసం ఎదురుచూస్తుంది. అన్యాయం పన్నాగాలు పన్నుతూ దుర్మార్గంగా రాజ్యమేలుతుంది. మానవత్వం గాయపడుతుంది. కాంతి కాలరాయబడుతుంది.

## 2

ఆగస్టు 20, 2013న మహారాష్ట్ర పూణెలో ఓంకారేశ్వరుడి సాక్షిగా 'నరేంద్ర దభోల్కర్' అనే పేరుకల డెబ్బయి సంవత్సరాల 'యువకుడ్ని' ఇద్దరు 'వృద్ధులు' చాలా దగ్గర్నించి కాల్చి చంపారు. ఆ సంఘటనకి ప్రత్యక్ష సాక్ష్యమైన శివుడి విగ్రహానికే నిజంగా ఏ మాత్రం చైతన్యమున్నా, ఖచ్చితంగా ఈ ఘోరం జరగనిచ్చేవాడు కాదు. తన పేరిట జరుగుతున్న మోసాల్ని అరికట్టడానికి అహర్నిశలు పాటుపడిన ఆ మహనీయుడి హృదయం తన ఎదుటే ఆగిపోవడం చూసి అప్పుడు స్థాణువై మూగబోయుంటాడు. ఆ గుండె ధైర్యానికి అవాక్కైపోయుంటాడు.

మహారాష్ట్ర మొత్తంలోని భూలోక దేవుళ్ళందరూ ఆనందం తట్టుకోలేక పండగ చేసుకుంటుంటే 'దభోల్కర్' అంటే ఏంటో తెలిసిన మనుషులందరూ సామూహికంగా దుఃఖించారు. దశాబ్దాల చీకట్లతో కేవలం జ్ఞానమనే ఆయుధంతో ఇతడెలా పోరాడేడా? అని ఆశ్చర్యపోయారు. మూఢ నమ్మకాల్ని తుదముట్టించడమే లక్ష్యంగా సాగిన ఈ అసాధారణ వ్యక్తి జీవనయానం తడిమిన లోతుల్లోకి చూస్తూ ఆయన అంతరాత్మలోకి పయనించే ప్రయత్నం చేస్తున్నారాయన అభిమానులు.

దాదాపు 13 సంవత్సరాలు ఏ బిల్లునైతే చట్టంగా తీసుకురావడానికి దభోల్కర్ ప్రయత్నించారో దాన్ని చివరికి తన రక్తం చిందించి సాధించారు. అనేకసార్లు ఛాందసవాదులచేత తిరస్కరించబడిన చట్టం ఆ ఉన్మాదుల ఇష్టాయిష్టాలతో నిమిత్తం లేకుండానే ఆర్డినెన్స్‌గా అవతరించింది. అయితే, దురదృష్టవశాత్తూ ఆయన ఆశయ సాధనలో ప్రధానభాగమైన మూఢనమ్మకాల వ్యతిరేక బిల్లును ఆచరించేనాటికి ఆయన లేకుండా పోయారు.

## 3

"It must be appallingly tragic to be civilised and educated and belong to such a country as India."

*– Russel*

1945లో సతారాలో పుట్టిన దభోల్కర్ విద్యార్థి దశలో చురుకైన కబడ్డీ ఆటగాడిగా పేరుపొందాడు. పదిమంది తోడబుట్టిన వారిలో దభోల్కరే చిన్నవాడు, సునిశిత దృష్టి కలవాడు. అందుకే, తాను చదివిన వైద్యవిద్యని వాడుకొని ఆర్థికంగా ఎదిగే ప్రయత్నం



చేయకుండా హార్దికంగా అన్వేషణ కావించాడు. వ్యవస్థలోని మూఢనమ్మకాలు పేదల జీవితాల్ని ఎలా చిదిమేస్తున్నాయో లోతుగా పరిశీలించాడు.

మొదట్నుంచి దభోల్కర్‌ది విశిష్టమయిన వ్యక్తిత్వం. సాంఘిక దురాచారాలంటే అసహ్యం, అన్యాయాల్ని ఎదిరించే స్వభావం వలన మొదట్నుంచీ కార్యశీలుడిగానే దభోల్కర్ ఉన్నాడు. మహారాష్ట్రలోని గ్రామాల్లో కులతత్వం వికృతంగా వుండేది. అన్ని భారతదేశ గ్రామాల్లోలాగానే అంటరానితనం అప్రకటితంగానే అమలయ్యేది. అందుకు వ్యతిరేకంగా బాబా అధవే ఆధ్వర్యంలో జరిగిన 'ఒక ఊరు–ఒకేబావి' ఉద్యమంలో దభోల్కర్ ఉత్సాహంగా పనిచేసారు.

ఆ తర్వాత 1989లో 'అంధశ్రద్ధ నిర్మూలన సమితి' స్థాపించి దాన్నొక సశాస్త్రీయ ప్రచార సంఘంగా మలిచారు. మూఢ నమ్మకాల్ని చీల్చి చెండాడుతూ అనేక పుస్తకాలు, వ్యాసాలు, కరపత్రాలు ప్రచురించారు. 'సాధన' అనే ప్రజాతంత్ర వారపత్రికనూ నడిపారు. కొన్ని వందల వేల కార్యక్రమాలు నిర్వహించారు. లెక్కలేనన్ని ఉపన్యాసాలిచ్చారు. ఒక్క మహారాష్ట్రలోనే కాక చుట్టుప్రక్కల సరిహద్దు రాష్ట్రాల్లో కూడా కలగలిపి దభోల్కర్ సంఘానికి 200 శాఖలున్నాయంటే ఆయన కృషి ఎంతటిదో గ్రహించొచ్చు.

## 4

అయితే, దభోల్కర్ కృషి కేవలం మూఢ విశ్వాసాలకే పరిమితం కాలేదు. అనేక సామాజిక జాఢ్యాల్ని తొలగించడానికాయన ప్రయత్నించారు. మహిమలున్నాయని డంబాలు పలికిన అనేకమందికి ఆయన సవాలు విసిరారు. మహారాష్ట్రలో సంవత్సరానికి సగటున 3 లక్షల హిందూ వివాహాలు నమోదవుతున్నాయనీ, కేవలం వాటినిబట్టి చూసినా తలంబ్రాల పేరుతో, అక్షింతల పేరుతో సుమారు 3 మిలియన్ కిలోల బియ్యం వృధా అవుతున్నాయని ప్రకటించి సంచలనం రేపారు.

కులాంతర – మతాంతర వివాహాల్ని ప్రోత్సహించారు. స్త్రీ విద్యకీ, స్వతంత్రానికీ ప్రాధాన్యతనిచ్చారు. అంతేకాదు, ఎల్లమ్మ చి జాత్' అనే మూఢాచారంపై ధ్వజమెత్తారు. దేవదాసి, బసివి లాంటి అమానవీయమైన ఈ సాంప్రదాయంపై ప్రజల్ని చైతన్యపరుస్తూ క్రమంగా అత్యధిక శాతం మందిచేత ఈ క్రతువుని మాన్పించగలిగారు. సింగనాపూర్‌లో శని దేవాలయంలోకి స్త్రీలని ప్రవేశింపజేయడానికి పోరాటం చేశారు. ఒక యువ

కళాకారుల కార్యకర్తల దళాన్ని నిర్మించుకుని రోజుల తరబడి మారుమూల గ్రామాల్లో విస్తృతంగా పర్యటిస్తూ ఉండేవారు.

అతీత శక్తులున్నాయనీ, దెయ్యాలనీ, భూతాలనీ, మాయలనీ – మంత్రాలనీ, చేతబడులనీ, బాణామతనీ రకరకాల పేర్లతో ప్రజల్ని మోసబుచ్చుతున్న వారే గ్రామంలోనున్నా అక్కడికి వెళ్ళి ఆ మోసకారుల పనిబట్టి వచ్చేవారు. దభోల్కర్‌కి భయపడి అనేకమంది భూలోక మహిమాన్వితులు పారిపోయారు. ఎందరో అవధూతలు తమ ఆధ్యాత్మిక దుకాణాలు మూసేసారు. అమ్మలు, బాబాలు, స్వామీజీలు అంధశ్రద్ధ నిర్మూలన సమితిపేరు వినగానే సాధారణంగా పలాయన మంత్రమొక్కటే జపించేవారు.

5

"I am blessed with some rare abilities, such as, organising work, keeping cool, perseverance enviable health and ability to travel and work continuosly without rest. Of course, age counts and the picture will eventually change. But I will try my best to remain alert and active".

– *Narendra Dabholkar, from* ***A never Ending Journey.***

శబ్ద (word) అనే పత్రిక దీపావళి ప్రత్యేక సంచికలో దభోల్కర్‌ని ఆయన అనుభవాల్ని గురించి ఒక కథనం రాయమని కోరగా రాసిచ్చారు. 2007 సంవత్సరంలో 'A Look Back' శీర్షికతో అదొచ్చింది. పై వాక్యాలందులోనివే. ఆయన పోరాటం మతాలపై కాదు. వాటినడ్డుపెట్టుకుని జనాన్ని మోసగిస్తున్న దుండగులపైనే. దాన్నే 'why do the ANS (Andha Shraddha Nirmoolan Samiti) oppose only Hindu Religion?' అనే తన రచనలో చాలా స్పష్టంగా ప్రకటించారు.

అనేక ప్రగతిశీల సంఘ బాధ్యులకి కూడా ఈ ప్రశ్న ఎక్కువగా ఎదురౌతోంది. ఇతర మతాల జోలికి పోని నాస్తిక హేతువాదులు హైందవ మతాన్నే ఎందుకు వ్యతిరేకిస్తారనీ. దానికాయన జవాబు చెప్తూ ఈ దేశంలో 82% మంది ప్రజలు హిందువులేననీ కావున వారిలో మూఢ నమ్మకాలతో బాధపడుతున్న వారిపై దృష్టి పెట్టక తప్పదని అన్నారు. అలాగే హిందూ మతాభిమానులకీ, హిందూ మతోన్మాదులనీ తేడా తెలిపే ప్రయత్నం చేసారు.





అంతేకాదు. హిందూ మతోన్మాదుల్ని ప్రస్తావిస్తూ, "ANS need not and does not recognize their monopoly, because the ANS feels that such parochial self proclaimed protectors and authoritarians has never been the spokesmen of the Hindu religion which is liberal, tolerant and ethical. They are not and will never be spokesmen of all Hindus." అంటూ హిందుత్వ వాదుల మొహం వాచే సమాధానమిచ్చారు.

6

జ్ఞానంపై అజ్ఞానం దాడులకి దిగడం కొత్తకాదు. ప్రశ్నించిన వార్ని పీడించడానికి ప్రయత్నించడం ఈ దేశంలోని హిందువులందరికీ దూరపు బంధువులమని చెప్పుకుంటూ పబ్బం గడుపుకునే అంధులకు అలవాటే. అందుకే దేశం మొత్తంమీద లెక్కలేనన్ని న్యాయస్థానాల్లో లెక్కకు మించిన అక్రమ కేసుల్ని దభోల్కర్ మీద బనాయించారు. అభాండాలేయడానికి ప్రయత్నించారు. వీలైనన్ని అవాంతరాలు సృష్టించి ఆనందించారు. ఇంత చేసినా వెనకడుగేయని ఆత్మవిశ్వాసాన్ని తట్టుకునే చేవలేక భౌతికంగా దభోల్కర్‌ని అంతమొందించారు.

ఆయన మీదా ఆయన సంస్థమీదా తప్పుడు కేసులు పెట్టినవారిపై పరువునష్టం దావావేయమనీ, తిరిగి కేసు పెట్టమని సలహాలిచ్చిన వారికెప్పుడూ ఆయన చిరునవ్వుతోనే జవాబు చెప్పేవారు. "I avoid reacting to criticism, entering the clamour of accusations and counter accusations and the blame game... I do not want to embroil the organization with lawsuits. I do not know whether lam right but one thing is sure that avoiding to react never puts you any loss. When one builds up his image in people's minds through such a long march it becomes immune to petty accusations" అంటారు దభోల్కర్.

జీవించినంత కాలం తమ సహాయం కోరకుండా ఒంటిచేత్తో ఉద్యమక్షేత్రాన్ని నిర్మించిన దభోల్కర్ అంటే న్యాయస్థానాలకీ, ప్రభుత్వానికీ కూడా చిన్నచూపే. అందుకే దభోల్కర్ కేసులో పురోగతి కనిపించడం లేదు. అలా కనిపించడం లేదనీ, అందుకే ఈ కేసును జాతీయ దర్యాప్తు సంస్థకు (National Investigating Agency)

బదిలీ చేయాలనీ కోరుతూ బాంబే కోర్టులో దాఖలైన ప్రజా ప్రయోజన వ్యాజ్యాన్ని కనీసం వినడానికి కూడా న్యాయమూర్తి ఇష్టపడకుండా 'నా ముందు కాదు' (Not before me) అంటూ వాపోయాడు. ఇక ముందైనా అలా కాకుండా ఉండాలని ఆశిద్దాం.

7

"Newtonian physics
Einsteins relativity
Secrets of atom
Science extending its hand to celestials
But
Beasts are still rummaging for blood."

***– From 'We are a nation of Cowards'***

దభోల్కర్‌ని హత్య చేసిందెవరో వారి ఉద్దేశాలు, ప్రయోజనాలు దభోల్కర్ హత్యతో ఎలా ముడిపడున్నాయో ప్రత్యేకంగా వివరించాల్సిన పనిలేదు. సాక్షాత్తూ ఆ రాష్ట్ర ముఖ్యమంత్రే స్వయంగా, The men who killed Gandhi, the minds behind it, have killed Dabholkar too అని ప్రకటించారు. నాథూరాం గాడ్సే మూలాలు పూణేలో వుండటం ఎంత యాదృచ్ఛికమైనా నాటి నుంచీ నేటిదాకా విస్తరిస్తున్న విద్వేష భావజాల వాస్తవం మరుగునపడదు.

గాంధీ హత్య తర్వాత మిఠాయిలు పంచుకుని సంబరాలు చేసుకున్న మనస్తత్వాలే దభోల్కర్ హత్య జరిగిన మరుసటిరోజే 'సనాతన ప్రభాత్' అనే తమ పత్రికా సంపాదకీయంలో ఈ హత్యని గురించి "చేసుకున్నవారికి చేసుకున్నంత" (One gets what one deserves) అని లజ్జలేకుండా రాసుకున్నాయి. హిందూత్వవాదుల బెదిరింపుల గురించి కొన్నిసార్లు విలేకరులు దభోల్కర్‌ని ప్రశ్నించేవారు. దానికాయన తేలిగ్గా నవ్వేస్తూ "In this movement, even expressing a thought is sometimes a fight" అనేవారు.

హేతువాదోద్యమంలోని లోతుపాతుల్ని లెక్కలోకి తీసుకోనంత అమాయకుడేం కాదు దభోల్కర్. అయితే, ప్రజా ఉద్యమాల్లోకి ప్రవేశించిన తర్వాత దాడుల గురించి





ఆలోచించడం దిగజారుడుతనమౌతుందనేది ఆయన భావన కావొచ్చు. అందుకే 'సనాతన సంస్థ', 'హిందూ జనజాగృతి' మొదలైన ఛాందస సంస్థలనుండి బెదిరింపులు వస్తున్నా 'గాంధీకి పట్టిన గతే నీకూ పడుతుందని' ఆ నీచులు హెచ్చరించినా బెదరలేదు.

మహాత్మా పూలే, సాహు మహరాజ్, అంబేద్కర్ ఆలోచనల్నుంచి స్ఫూర్తిపొందిన అసామాన్యమైన దభోల్కర్ వ్యక్తిత్వం ఇలాంటి లేకి బెదిరింపులకి లొంగితే ఆశ్చర్య పడాలి కాని లొంగకపోతే కాదు. హేతుబద్ధమయిన జ్ఞానాన్ని అందరికీ అందుబాటులోనికి తీసుకురావడం కోసం అనాదిగా ఆలోచనాపరులందరూ అవిరామమయిన కృషి చేస్తూనే వున్నారు. అందుకు తమ జీవితాల్ని పణంగా పెట్టినవారు సైతం లేకపోలేదు. ఆ అరుదయిన అమరుల జాబితాలో ఈరోజు చేరిన మరోపేరే నరేంద్ర దభోల్కర్.

సామాన్య జనావళిలో హేతుబద్ధ భావాల్ని ప్రవేశపెట్టడంపై దభోల్కర్, "Eradicating superstition is not isolated work. It is necessary to unite it with the larger comprehensive social reform movement.. అని వక్కాణిస్తూనే "Sowing seeds of reason in the mind is not an easy job. However reason uttered repeatedly does take you a step ahead. The utterance converts into a movement" అంటాడు. తిరోగమిస్తున్న వ్యవస్థని అదిలించేందుకు అవతరించిన అరుదైన హేతువాద తాత్వికుడిగా నరేంద్ర దభోల్కర్ ఆశయాల్ని నిర్మాణాత్మకంగా కొనసాగిస్తూ మూఢ నమ్మకాల వ్యతిరేక చట్టాన్ని దేశం మొత్తం అమలుచేసేలా చేయడమే ఆయన కృషికి మనతరమిచ్చే నిజమైన నివాళని నేననుకుంటున్నాను.

"... not of the battles won or lost
but of those fought or unfought."

*– Che-gu-vera*



# ముగింపు

*"మానవజన్మ తిని కూర్చోడానికి, భోగించి చచ్చిపోవడానికి కాక కొన్ని ఉత్తమాశయాల సంసిద్ధికోసమను మాట నెవ్వరూ మరువకూడదు. సాధారణ ఆహారనిద్రా భయభోగాదులను జంతువులు కూడా అనుభవించి నీల్గుచున్నవి. వానికంటే మానవునిలో ఉన్న విశేషము జ్ఞానము. ఆ జ్ఞాన వాహినిని విజృంభించుటవకాశములు కల్పించకున్నచో మానవ జీవితమే వ్యర్థము."*

**– *గరిమెళ్ళ సత్యనారాయణ***

అర్ధమానవుడు ఆహారాన్వేషి. అతడు పూర్ణమానవుడిగా సత్యాన్వేషణ ప్రారంభించే నాటికి అతడి చైతన్యం పరిమితమైనది. దానిని వృద్ధి చేసుకునే క్రమమే భౌతికంగా బౌద్ధికంగా మనిషిని అద్వితీయమైన బుద్ధిజీవిగా మల్చింది. అదే మానవుడికి మహాశక్తినిచ్చింది. అప్పటిదాకా ఆహార సేకరణకు, శరీరవసరాలకూ మాత్రమే ఉపయోగపడిన మెదడు నూతన పరిపక్వ భావాల్ని సృజించనారంభించింది. శరీరాన్ని, చేతుల్ని వుపయోగించే విధానమూ, బలాన్ని చేతుల్లో – కాళ్ళల్లో కేంద్రీకరించుకుని ఆలోచనల్ని ఆచరణాత్మకంగా మలుచుకునే క్రమమూ మనిషిని జంతుజాలం నుంచి మరింత దూరం చేసాయి. ఐతే, అక్కడితో తృప్తిపడుంటే తత్వానికి అర్ధమే ఉండేది కాదు. కానీ, అలా జరగలేదు. ప్రాకృతిక పరిణామాన్ని స్వీయాత్మకంగా గ్రహించిన ఆదిమ మానవుడి బుద్ధి స్పష్టంగా నిరంతర మార్పుని అనుభవించడం నేర్చుకుంది. భౌతిక శ్రమకి మానసిక బుద్ధిని జోడించడం జరిగింది. దానివల్ల అతడు శారీరకంగానూ మానసికంగా కూడా పరిణితి పొందాడు. తన మూలాన్ని తానే శోధిస్తూ, విశ్వతత్వాన్ని అన్వేషిస్తూ తాత్వికాన్వేషణ కావిస్తూనే ఉన్నాడు. మనిషి తన గురించి తాను మొదలెట్టి మొత్తం పదార్ధజనిత పరిణామాన్ని నిర్దిష్టంగా అర్ధం చేసుకుందుకు చేసిన ప్రయత్నమే తత్వం. నాటి నుండి నేటి వరకూ చారిత్రకంగా సాగిన, ప్రస్తుతం కొనసాగుతోన్న సత్యాన్వేషణా పయనాల్ని క్రోడీకరించడమే తత్వశాస్త్రం. తత్వం మనిషికి అస్త్రంగా పనిజేసింది. ఆంగ్లంలో philosophy అనే పదాన్ని తత్వశాస్త్రానికి సమాంతరంగా వాడుతున్నాం. ఇది గ్రీకు భాషలోని philosophia నుంచొచ్చింది. అంటే జ్ఞానాన్ని ప్రేమించడమనర్దం. అలాగే తర్కము logic అనే పదం కూడా గ్రీకులో logiketekhne అనే పదం నుంచొచ్చింది. కార్యకారణాల్ని తెలుసుకునేది (Art of Reason) అని దానర్ధం. కడుపుకి తిండి, కంటికి నిద్రా, వొంటికి వ్యాయామం, కాయానికి కామమూ మాత్రమే ముఖ్యమైనవిగా భావించిన మానవుడు అంతటితో సంతృప్తిని పొందక ఆంతరిక జిజ్ఞాసను అభివృద్ధి చేసుకున్నాడు. మరణంలోని మార్మికతని జ్ఞానంతో ఛేదించడానికి చూసాడు. ఇక్కడి దాకా వచ్చాడు. దీనంతటికి 'లోకస్యకాగతిః' (లోకమే గతిలో నడుస్తోంది?) అన్న సందేహం ఆనాటి మానవుడికి కలగడమే నాంది.. అందుకోసమే అనేక వాదాలూ, వివాదాలు. ఏది ఏమయినా వైజ్ఞానిక తాత్విక దృక్పథాల్లో ప్రాపంచికాభివృద్ధి కోసం ప్రయత్నించే మరొక అభిప్రాయానికి చోటుంచడమే భావితరాలకు ప్రగతి కాముకులందించే ఉన్నతమయిన ప్రజాస్వామ్య విలువ. మన సిద్ధాంతాలు, చర్చలు, తద్వారా జనించే భావనలు వీలైనంత ఎక్కువమంది విద్యార్థుల్ని, ఔత్సాహికుల్ని సాంఘిక హితం కొరకు తాత్విక క్షేత్రంలోకి ఆహ్వానించగలిగేంత ఆత్మీయంగానూ, ఆకర్షించగలిగేంత ఆసక్తిదాయకంగానూ అవలంబించబడాలే కాని సున్నిత హృదయాలను నొప్పించేలా ఉండకూడదనేది నా భావన. "The Philosophical consequence of modern science is to abolish completly the distinction between science and philosophy" అంటాడు రాయ్. మానసికంగా మనమింకా వెనకబడే వున్నామని నిరూపించుకోడానికి తప్ప అడుగడుగునా మన అహంభావాల్ని ప్రదర్శించుకుందుకు చూపే వివాదాలు మరెందుకూ వుపయోగపడవు. కాబట్టి, తాత్విక క్షేత్రంలో కృషి చేస్తున్న వారందరికీ ఇదే విన్నవించుకుంటున్నాను. కల్సి పనిచేయగల సందర్భాల్లో కలవడానికి ప్రయత్నిద్దాం. లేనప్పుడు ఎవరి పని వారు చేసుకుందాం. కుదిరితే మిత్రులుగా వుందాం, లేకపోతే పరిచయస్తులుగానే మిగిలిపోదాం. అంతేకాని అనవసరమయిన అంశాల్లో అత్యుత్సాహం చూపించో, ఆవేశంతో కోపించో మానవ సంబంధాల మీద మమకారాల్ని కోల్పోయే స్థితి తెచ్చుకోవద్దు. మన వాదాలకీ, సిద్ధాంతాలకీ అంతిమ కేంద్రం మనిషేనన్న నిజాన్ని మరిచిపోవద్దు. శెలవ్!

**"Walls Walls**
**Within and Without**
**Man Cries**
**For life humane"**

*– Subrahmanyam*




## ప్రజాస్వామ్య పతనం

**(The Decline of Democracy)**

బిత్తరచూపులు చూస్తూ బిచ్చమెత్తుకునే బాలలోకవైపు. బెంజికారులో నుండి కాలు కింద పెట్టని బిలియనీర్లు ఇంకోవైపు ఎందుకున్నారు? నాలుగు మెతుకులు కోసం మనసు చంపుకుని ముష్టెత్తుకుంటోన్న మనుషులోకపక్కా, నాలుగ్గోడల మధ్యా మరో సృష్టి గావించి అందులోనే కులుకుతోన్న మిలియనీర్లు మరో పక్కా ఎందుకున్నారు? నిత్య నూతనత్వాన్ని నిబిడీకృతం చేసే అద్దాల మేడలోకవైపు నిరాశ, నిస్పృహలు నిండిన నిజ జీవిత కథనాలు మరోవైపు, మన నగరాల్లోంచి ఎందుకు నిత్యం తొంగి చూస్తున్నాయి? శాస్త్ర సాంకేతిక రంగాల్ని సైతం తన వశం చేసుకున్న మానవ మేధస్సు మరో మనిషి కడుపు నింపడానికి ఎందుకు పనికిరావడం లేదు? విశ్వవిజ్ఞానాన్ని తనవైపు తిప్పుకో గలిగిన మనిషి మస్తిష్కం తోటి మానవుడికి మనగలిగే మార్గాన్ని ఎందుకు చూపెట్టలేక పోతోంది? బాల్యంలో పాలకి, ప్రాయంలో శ్రమకి, వయసయిపోయాక వృద్ధాప్యంలో మంచానికి, మిగిలింది మట్టిలో కల్సి మాయమయి పోవడానికే మనుషులుగా మనం మసలుతున్నామా?

బతికి చచ్చేదాన్ని జీవితమంటారు. చస్తూ బతికేదాన్ని బానిసత్వమంటారు. బతకలేక - చావలేక పడుండడాన్ని పౌరసత్వమంటారు. ప్రస్తుతం మనమున్న స్థితదే. దాన్ని గతిమార్గం పట్టించడమే అక్షర లక్ష్యం. ఈ భూమిపై పట్టెడు మెతుకులు కోసం జరిగే ప్రతి పోరాటంలోనూ పేదవాడి పక్షాన నిలబడేదే నిజమయిన అక్షరం. బద్ధమయిన అక్షర తత్వమెప్పుడూ భవితవ్యమే. ప్రజాభ్యుదయమే. అలా భవిష్యత్తు కోసమే బతికే ప్రతి అక్షరానికీ చీకటి చరిత్ర పొరల్లో దాగున్న చెరగని దృక్కోణాలన్నీ దారి చూపెడుతూనే ఉంటయి. మౌనపు అట్టడుగు మార్గాల్లో మెలిగే భావాలన్నీ దాని భావచైతన్యపు బాటలో భాసిస్తూనే ఉంటాయి.

అటువంటి అజరామర పథాలే అక్షరాల ఉనికిని నిర్దేశిస్తాయి. అక్షరాల్లోని ఉష్ణపు స్థాయిని నిర్ణయిస్తాయి. అణచబడిన ఆశల సౌథాల్లోని అజ్ఞాత ఆశయాలే అక్షరాలకి అడుగులు నేర్పిస్తాయి. స్వార్ధంతో విరామం లేని యుద్ధంకోసం సృష్టించబడే అద్వితీయమయిన అక్షరయాత్ర ప్రయాణమెప్పుడూ విజయం వైపుగానే సాగుతుంది. దిగ్విజయంగానే ముగుస్తుంది. ఆయుధాల్ని అంతం చేయగలిగిన ఆయుధాలెన్నో పుట్టాయి గానీ, అక్షరాల్ని జయించగలవింకా పుట్టలేదు. ఎప్పటికీ పుట్టలేవు.






## అరాజకత్వం అంటే ఏమిటి?

**(What is Anarchism?)**

ప్రస్తుతం నడుస్తున్నది క్షీణిస్తున్న ప్రభుస్వామ్యం. ధ్వంస మవుతున్న ధనస్వామ్యం. ఈ వ్యవస్థది మరణించబోయే సుఖరోగి దశ. కనుకనే వ్యక్తిగత సుఖాలన్నీ సమిష్టిగా మనం భావిస్తుంటాం. అందంగా కనిపించే భ్రాంతుల్ని ఆలింగనం చేసుకుని వాటికి అప్రయత్నంగానే అమ్ముడుపోతుంటాం. మనకంటూ సొంతంగా శరీరాలు తప్ప అంతరాత్మలుండవు. అస్తిత్వాలే కాని వ్యక్తిత్వాలుండవు. బతుకీడ్చడమే జీవితమనుకుంటూ జీవచ్ఛవాల్లా నలుగురితో పాటు నలుగుతుంటాం. నలుగుతూనే నశిస్తాం. ఇక వెలిగించుకుని వ్యక్తిత్వాన్ని తీర్చిదిద్దుకునే తీరికెక్కడిది మనకి? తీరిగ్గా అరువు తత్వాలన్నింటినీ మిశ్రమత్వంగా మనలో మలచుకోవడం తప్పా, మనకి పూర్తిగా మన గురించి ఆలోచించుకునేందుకే తీరిక లేదు. ఇక సమయాన్ని సమాజం కోసం కేటాయించడమనేదిక్కడ అప్రస్తుతం. ఇన్ని అలౌకిక భావాల్ని, పారలౌకిక లక్షణాల్నీ పారద్రోలి ప్రగతిబాట పట్టినప్పుడే నిజమైన ప్రజాస్వామ్యం సాధ్యపడుతుంది.




## సాంఘికతత్వం-వైప్లవ మార్గం

**(Social Philosophy-Revolutionary way)**

ప్రశ్నించేది విజ్ఞానం. అనుసరించేది అజ్ఞానం. అజ్ఞానాన్ని అది అజ్ఞానం కాబట్టి విసర్జించాలి. విజ్ఞానాన్ని విజ్ఞానం కాబట్టి స్వీకరించాలి. అత్యధికమందిచేత అంగీకరించి ఆమోదించ బడినంత మాత్రంలో అజ్ఞానం విజ్ఞానమూ అయిపోదు ఎవరూ ఆమోదించకుండా తిరస్కరించినంత మాత్రాన విజ్ఞానం అజ్ఞానమూ అవదు. అందరూ ఒప్పుకున్నంతలో అసత్యం సత్యం కాదు. ఎవరూ ఒప్పుకోనంతలో సత్యం అసత్యమూ కాదు.

అజ్ఞానం అంధకారానికి చిహ్నం. విజ్ఞానం విప్లవానికి చిహ్నం. విజ్ఞాన మూలం తత్వం. తత్వానికి తార్కాణం సత్యం. సత్యానికి అన్వేషణ ముఖ్యం. అలాంటి సత్యాన్వేషణ గమనాన్ని గ్రాహ్యం చేసుకున్న వ్యక్తిత్వాలకి పొగరనేది పొగడ్తలవల్లో, తెగడ్తలవల్లో వచ్చినది కాదు. అది అప్రయత్న ఆభరణమే తప్ప అలంకారప్రాయమో, అహంకార

చిహ్నమో కాదు. ఆకతాయితనాన్నే ఆత్మవిశ్వాసంగా భ్రమసే అల్పుల గల్లాపెట్టెల బుర్రలకి అది అందదు.

అంతరాత్మని అహంభావాలకి తాకట్టుపెట్టి ఆకాశంపై బురద జల్లడానికి ప్రయత్నించడం అవివేకం. నింద నింగినంటదు. నలుగుర్లో వేర్పాటుతనాన్ని ప్రదర్శిస్తూ తాము భిన్నంగా బ్రతుకుతున్నామనుకోవడం ఆధునిక బానిసత్వం. ఇది వెర్రికి చిహ్నం కానీ వ్యక్తిత్వానికి కాదు. వ్యవస్థతో వంతపాడుతూ నలుగుర్తో నలగడమే నయమనుకోవడం పురాతన బానిసత్వం. ఇది నంగిరికి చిహ్నం కానీ నైతికతకి కాదు. వింత, వికారం, విభిన్నత, వైవిధ్యం లాంటివన్నీ మన వెకిలితత్వాన్ని చెబుతాయి తప్ప వ్యక్తిత్వాన్ని వ్యక్తపరచవు.

ఈ ఇరురకాల భావబానిసలూ మేమిలాగే ఉంటామంటూ సగర్వంగా ప్రకటించడానికి ప్రయత్నించేది సిగ్గుమాలిన సూత్రీకరణల్నే కానీ నిగ్గుతేల్చిన నిర్ణయావిష్కరణల్ని కాదు. అరువు తత్వాన్ని అందంగా రంగరించుకుని ప్రదర్శించేది మొద్దుబారిన మనస్తత్వాల్నే తప్ప హద్దులెరిగిన మానసిక స్థైర్యాన్ని కాదు. ఇటువంటి పిడత వ్యక్తిత్వాల ప్రవర్తనకీ, సిద్ధాంతాలకీ ప్రత్యేక వ్యాఖ్యానం అక్కర్లేదు. పిచ్చికి ప్రత్యేక ప్రదర్శన అవసరం లేదు. దానికదే స్వీయపైత్యాన్ని ప్రదర్శిస్తుంటుంది.

సద్విమర్శల్ని తప్ప సామరస్యం – సమాలోచనా లోపించిన ప్రతీ వ్యాధి ప్రకోపిత పైత్యాన్నీ పెద్ద మనసుతో స్వీకరించేటంత 'స్పోర్టివ్‌నెస్' నాకు లేదు. ఇకపై రాదు. వెల్ అండ్ గుడ్!

## ఒక నాస్తికుడి నామా




నిజానికి నమ్మేవారితో నిమిత్తం లేదు. అబద్ధానికి అంగీకరించిన వారితో అనుబంధమూ లేదు. మనుషులుగా ఏది నిజమో – ఏది అబద్ధమో, ఎలా నిజమో – ఎలా అబద్ధమో, ఎందుకు నిజమో – ఎందుకు అబద్ధమో, ఎప్పుడు నిజమో – ఎప్పుడు అబద్ధమో, బేరీజు వేయలేని మన వివేకం వృథా.

మతాలకి ప్రత్యామ్నాయంగా మార్క్సిజాలు, మానవ వాదాలు బయలుదేరి మనిషి స్వేచ్ఛకు సమాధి కట్టాయి. మతాధిపతులకు పోటీగా నాస్తిక, హేతువాద శిఖామణులు సైతం కొలువుదీరి తమ దుకాణాల అమ్మకాలు పెంచుకుంటున్నారు. అసలనేది లేని వీరంతా కొసరుకి కొమ్ము కాస్తున్నవారే.

అధ్యయన రచనలు కూడా ఆచరణలో భాగమేనని ఊగేవారూ, ఆచరణతో సంబంధంలేని అధ్యయనాలు, అక్షర వ్యాసంగాలు ఎందుకని పేలేవారు, ఇరువురూ ఇరుకునే సరుకుగా భావిస్తూ నిజాలకు భయపడి బెరుకుగా జీవిస్తున్నారు. ఆంతరిక అల్పత్వం స్వతహాగా వీరి సైద్ధాంతిక లోపం.

మనం జీవిస్తున్నామని ధృవపరిచే కొండగుర్తులని మొండిగా తగిలించుకుని బండిలా ముందుకు సాగుతూ, పుట్టిన కులానికి కట్టుబడి, చెప్పిన మతానికి ఇష్టపడి, తోచిన వృత్తికి బోర్లాపడి, దొరికిన బాంధవ్యాలకు బాకీపడి, సంఘానికి సాక్షాత్కార పడడమే సగటు జీవి జీవితంగా ఎంచబడుతోంది.

సత్యం పేరుతో నచ్చిన తత్వాన్ని నెత్తికెక్కించుకుంటూ, జ్ఞానమంటూ మెచ్చిన తర్కాన్ని తలకి రుద్దుకుంటూ, మనచాంచల్యాన్ని చాటుకునే స్వేచ్ఛ మనకున్నట్లే, ఎదుటివారి చిత్తాన్ని సైతం ఆహ్వానించాలనే ఔచిత్యాన్ని మరచి, మనకు నచ్చిందే నందని – మనం మెచ్చిందే పందని పరవశించడం కద్దు.

ఏది నిజమో ఏది కాదో నిజాలను బట్టి కాక ఇజాలను చదివి తెలుసుకోవాలనుకోవడం బుద్ధిజీవుల దౌర్భాగ్యమైతే, అది ఎలా నిజమో ఎందుకు నిజమో తమ బుద్ధిని బట్టి కాక, బుద్ధిలేమి జీవులని అనుసరించి తెలుసుకోవాలనుకోవడం సామాన్య జనాల సాంప్రదాయక జాఢ్యం.

జ్ఞానంపై గుత్తాధిపత్యానికి మేధస్సనేది ఏ ఒక్కరి సొత్తూ కాదు. కాబోదు!

## ప్రజాస్వామ్య ప్రస్థానం

**(The Journey of Democracy)**




అజ్ఞానానికి అనేక కారణాలున్నాయి. జ్ఞానాన్ని ఆర్జించాలనే ఆర్తి లోపించడం అందులో ప్రథమమైంది. ప్రధానమైనది. అర్ధదశాబ్దం కిందట నన్నొక నక్సలైట్‌గా ప్రచారం చేసిన ప్రబుద్ధుల బాగోతం నాకిప్పుడు జ్ఞాపకం వస్తోంది. ఆ విషయం గురించి బహిరంగంగానే నన్ను ప్రశ్నించి

భంగపడిన పుంగవులూ ఇంకా నా స్మృతి పథంలోనుంచి చెరిగిపోలేదు. అపుడప్పుడే పుట్టుకొస్తున్న కొత్త పరిపక్వతని పూర్వం చేసుకొనే దిశగా సాగిన ప్రస్థానంలో నా తాత్కాలిక తాత్విక మజిలీల్నే నా తత్వంగా భ్రమసినవారున్నారు. అంతే కాకుండా నా రచనాశైలి, వ్యక్తిగత వ్యవహారశైలీ కొందరు మిత్రులతో అపార్ధాలకు తావిస్తున్నట్లు తెలిసింది. వారి అస్పష్ట అభిప్రాయాలలో స్పష్టత చేకూర్చడం అవసరమనిపించింది. నా మొదటి రచనలో నన్ను మార్క్సిస్టుగా – కమ్యూనిష్టుగా భ్రమించినవారున్నారు. ఆ తరువాత నేనొక తీవ్రమైన, అతిప్రమాదకరమైన అరాజక వాదినని నమ్ముతున్న వారున్నారు. అటుపిమ్మట నేను నాస్తికుడినని, హేతువాదినని, రాడికల్ హ్యూమనిస్టునని, జోరుగా ప్రచారం చేస్తున్న జోరీగలుండనే ఉన్నారు. ఒక దశలో ఇవన్నీ నాయిజాలే అయినా, నిజానికి నేనేవాదినీ కాను. మానవుడిని వాదనలకి పరిమితం చేసే భావాలకు బద్ధ విరోధిని. భావవిప్లవమొకటే మనిషి అభ్యున్నతికి అగ్రాంగం అని భావిస్తున్నవాడిని. ప్రస్తుత రాజకీయ విధానాలకి ప్రత్యామ్నాయంగా అరాజకత్వాన్ని అర్ధవంతంగా పరిచయం చేయాలనుకున్నానే తప్పా ఆద్యంతం అరాజకత్వాన్ని పట్టుకువేలాగే ఉద్దేశం కూడా నాకు లేదు. సర్వామోదం ఎప్పుడూ నాకు సమ్మతం కాదు. ఆరోగ్యవంతమైన విమర్శ దర్శించని విజ్ఞానం వ్యవస్థీకృతమౌతుంది. అటువంటి జ్ఞానం అవివేకాన్ని సంతరించుకొని ఉన్నచోటునే కూర్చుండిపోతుంది. అదే అజ్ఞానం, మతావిర్భావాల మూలం ఇదే. నిరంతర జ్ఞానతృష్ణ మాత్రమే తత్వసాధనకి – సత్యశోధనకి మార్గం సుగమం చేస్తుంది. అందుకు మనిషికి మనిషిని గురించిన ఆదుర్దా తప్పా మరే సిద్ధాంత ముద్రా, వేదాంత దురదా అవసరం లేదు. ఇంతా చదివి ఇంతకీ మీరేపక్షమో చెప్పండంటూ ప్రశ్నించే ప్రబుద్ధులకి ఏమని చెప్పగలను? వారి బుద్ధి ఇంతేనని మౌనంగా సరిపెట్టుకోవడం తప్పా!




## అస్తిత్వం – అరాజకత్వం

### (Existence - Anarchism)

ఆర్థికంగా స్థిరపడి అక్షరాలకి ధర నిశ్చయించుకోమన్న వాళ్ళు, అక్షరాల్ని అమ్ముకొని ఆర్థికంగా నిలదొక్కుకొమ్మన్నవాళ్ళూ, అసలవ్వన్నీ నీకెందుకంటూ ఆడిపోసుకున్న అభిమానులు, అందిరలా ఉండలేవా? అంటూ అంతెత్తులేచే చిద్విలాస పరులూ, ఇల్లు చక్కదిద్దుకున్నాక సంఘం గురించి ఆలోచించ మంటూ సలహాయిచ్చే శ్రేయోభిలాషులూ, ఇలా నా మంచి కోరిన వారందరికీ మనస్ఫూర్తిగా వందనాలు తెలుపుకోగలనే కాని అంతరాత్మతో సంపూర్ణంగా విబేదించి నన్ను నేను మోసం చేసుకోలేను. ఎప్పటికప్పుడు కొత్త చేతనత్వానికి సిద్ధపడే నా స్వభావం తాత్కాలిక బెదిరింపులకి తలొంచిందంటే దానర్ధం మరొకరిని కష్టపెట్ట కూడదనే తప్ప మానసికంగా ఇష్టపడి మాత్రం కాదనేది స్పష్టం.

అన్యాయాలు, అక్రమాలు పెరిగిపోతున్నాయంటూ కుదిరినప్పుడల్లా కబుర్లు చెప్పుకొనే వారి కోవలోకో, తోచినప్పుడల్లా మంచికి ఇవి రోజులు కావంటూ గొంతులు చించుకునే వారి తోవలోకో, అడపాదడపా పనికిమాలిన ఆవేశాలతో అరిగిపోయిన నినాదాలెత్తుకొనే ప్రబుద్ధుల వరుసలోకో అల్లంత దూరంలో నిలబడి ఆచరణో... ఆచరణంటూ అరిచి గీపెట్టే బడుద్దాయి బారులోకో నేను కూడా చేరిపోయి నలుగురితో నారాయణ, కులంతో గోవింద అనుకొనే మందతో సహా అమ్ముడుపోయి అంతరాత్మకి పంగనామాలు పెట్టుకోదలచుకోలేదు. నిత్యం బుగ్గిపాలవుతున్న కోట్లాదిమంది యువజనుల వర్తమాన జీవితాలకన్నా నా భవిష్యత్తేమి గొప్పది కాదు. అయినా గొప్పతనం కాలానికి ఎదురీదిన వ్యక్తిత్వాల్లో వెతకాలే కాని, కుదేలుపడిన బతుకుల్లో కాదు.

కదలిక చైతన్యానికి, నిర్లిప్తత నిర్జీవానికి చిహ్నాలు. కాబట్టి, ఇప్పటికైనా బడలిక వదిలి కదలడానికి ప్రయత్నించడం మనుషులుగా మన అస్తిత్వాన్ని నిరూపించడానికి పనికొచ్చే కనీస ప్రమాణమేమో!




## మద్యంపై యుద్ధం

### (War on Liquor)

పుస్తకం పూర్తి చేయమని తొందరపెట్టిన మిత్రులందరూ అంతిమంగా మౌనం పాటించడం వలన ముద్రణా భారం మోయలేక కొంతకాలం పక్కన పెట్టాల్సి వచ్చింది. మనతో అంటకాగుతున్న వారు మాత్రమే మంచి వారనే ధోరణి క్రమంగా మనమున్న సంఘాలకి బాకాఊదని బాపతంతా బైటివారుగా భావించి, మనది కాని మంచితనంతో అంటరానితనాన్ని పాటించే దశకు చేరుతుంది. అంతమాత్రంలో కొంపలేవీ మునిగిపోవు కానీ వ్యక్తుల మధ్య మిత్ర సంబంధాలు చెప్పుకోలేని విధంగా దెబ్బతింటాయి.

వ్యసనాల విషయంలో సరిదిద్దుకోగల తప్పుల్ని వ్యక్తుల విషయంలో సరిచేసుకోవడంలో విఫలమవడం వలన నేను కోల్పోయిన ఆత్మిక సంబంధాలే బహుశా మనిషి పట్ల నా బాధ్యతని మలచగలిగాయని అనుకుంటాను. అందుకే సామాన్యుల జీవితాలలో ప్రదర్శించబడే క్రూరమైన ఉద్రేకాలకి ముఖ్య కారణం 'మద్యం' అనే మహమ్మారి కావడం మనుషులుగా మన దుర్బలత్వానికి చిహ్నమని అంగీకరించడానికి ముందుకు రానంత కాలం జన జీవితాన్ని ఈ వ్యసనమే శాసిస్తుందనడం అతిశయోక్తి కాదనుకుంటాను.

ఎవర్నీ కించపరచాలనో, కిందస్థాయికి దిగజార్చాలనో నేనేదీ రాయలేదు. చేయలేదు. నా దేశాటనకి – పుస్తక పఠనానికి ప్రయోజనమంటూ ఏదైనా ఉంటే అది సామాజికమైనదే కానీ స్వాభావికమైనది కాదు. తమ అస్తిత్వానికి అసూయనే ప్రామాణికంగా పెట్టుకుని వ్యక్తిత్వాన్ని మద్యం కోసం దిగజార్చుకున్న ప్రబుద్ధులందరూ నాపై తోచినప్పుడల్లా బురద జల్లుడు కార్యక్రమం అమలు చేస్తున్నప్పుడు కూడా మౌనమే సమాధానమనుకుంటాను నేను. ప్రేమించడం నేర్చుకున్నంతగా ద్వేషించడం నేర్చుకోకపోవడం వ్యక్తిగా నా లోపమేమో.

నేను నిజమని నమ్మినదాన్ని సాధ్యమైనంత స్పష్టంగా వీలైనంత నిజాయితీతో వ్యక్తీకరించడానికి ప్రయత్నించడం వలన మాత్రమే ఏదో మేరకు సమాజంతో సత్సంబంధం నెరపడం జరుగుతుందని నమ్ముతున్నాను. అందుకే ఇజాల గొడవలేని నిజాలకే అక్షరరూపం ఇస్తున్నాను. రచనా వ్యాసాంగాన్ని పరిమిత ప్రచార సాధనంగానే నేను తలుస్తున్నాను. నా ఈ మాటలేవీ తుది తీర్పులు కావనే భావనతోనే చదువరులు దీన్ని గ్రహించాలని మనవి చేసుకుంటూ, నే చేసిన కొన్ని తప్పులనైనా ఈ రకంగా ఒప్పుకుని ప్రాయశ్చితం చేసుకుంటున్నాను.




## మతానికి మరణశాసనం
## మనిషికి పునరుజ్జీవనం

నిత్య జీవితంలో సైన్సు ఫలాన్ని అనుక్షణం అనుభవిస్తూ కూడా నిత్యం మూఢ నమ్మకాలపై ఆధారపడే వ్యాధి వ్యవస్థలో బాగా ముదిరిపోయింది. శాస్త్ర విజ్ఞాన ఆవిష్కరణల ఆసరా లేకుండా కాలు కదపలేని మనం, అశాస్త్రీయంగా ఆలోచిస్తూ అతీత శక్తుల్ని గుడ్డిగా ఆరాధించడానికే అలవాటుపడ్డాం. రాకెట్ల యుగంలో బతుకుతూ కూడా లాకెట్ల మహిమలు నమ్ముతూ సమాజంలోని భావితరాలకు వైజ్ఞానిక ద్రోహం చేస్తున్నాం. దెయ్యాలు, భూతాలు, ఆత్మలు, ప్రేతాత్మల్ని గురించిన అబద్ధపు కథల్నే అందంగా మన వారసులకి అందిస్తున్నాం. వ్యక్తిగత సమస్యలకి రోజువారీ పూజలు, శారీరక రోగాలకి రకరకాల తావీజులు, మానసిక పైత్యాలకి మంత్ర తంత్రాలు, సామాజిక సంక్షోభాలకి స్వామీజీలు – అమ్మలు– బాబాలు, రాజకీయ జారత్వానికి జ్యోతిష్యం, వాస్తు, ఉంగరాలు, వర్షాలకీ – వాతావరణ కాలుష్యానికి కట్టగలిపి ఖరీదైన యజ్ఞయాగాలు... మొదలైన దొంగ వ్యాపారాలన్నీ ప్రజల మానసిక బలహీనతలపై మూకుమ్మడిగా దాడిచేస్తూ రాజ్యమేలుతున్నాయి. ప్రజలు సక్రమంగా ఆలోచించడం ఆరంభిస్తే తమ అస్తిత్వానికి ప్రమాదమని గ్రహించిన పాలకులు అనేక అశాస్త్రీయ అక్రమాలోచనల్ని క్రమబద్ధీకరించి జనాల్లోకి జొప్పిస్తారు. అతీత శక్తుల్ని విశ్వసించే వారెప్పుడూ అశక్తులుగా ఉంటారు. అలాంటివార్ని కుదిరినట్లు ఆడించడానికీ, ఇష్టమొచ్చినట్లు పాలించడానికీ వీలవుతుంది. అందుకే ప్రజల్ని అజ్ఞానులుగా ఉంచి తమ పబ్బం గడుపుకుంటారు సాంఘిక జలగలు. సమాజంలోని అత్యధిక శాతం మందికి అందుబాటులోకి రాని ప్రాథమిక అవసరాలైన తిండి, బట్ట, విద్య, వసతి, ఆరోగ్యం... మొదలైన వాటిని ఎరగా వేసి ప్రజల్లో మానసిక బానిసత్వాన్ని పెంపొందిస్తారు. అన్నదానం, వస్త్రదానం, విద్యాదానం... అంటూ జనాలకు జంగిలి మనస్తత్వాన్ని అలవాటుచేసి దాన్నే సంఘసేవగా ప్రచారం చేసుకుంటారీ ఆధ్యాత్మిక గుంటనక్కలు. దైనందిన జీవితాల్లో క్షణకాలం సైన్సుగాలి సోకకపోతే విలవిల్లాడిపోయి విగత జీవుల్లా తయారయ్యే మనం శాస్త్రాన్నీ ప్రకృతినీ అధ్యయనం చేయడానికీ, అసమానతలు ఎందుకున్నాయో అర్థం చేసుకోడానికి ప్రయత్నించకుండా అభౌతిక శక్తుల్ని ఆరాధించడం అమానుషం. ప్రశ్నించడం విజ్ఞానానికి, అనుసరించడం అజ్ఞానానికీ ప్రతీక. కాబట్టి ప్రజానీకం, ప్రధానంగా విద్యార్థులూ, యువతా ప్రతీదాన్ని ప్రశ్నించడం నేర్చుకోవాలి. హేతుబద్ధంగా ఆలోచించడం అలవర్చుకోవాలి. శాస్త్రీయ దృక్పథాన్ని పెంపొందించుకోవాలి. సక్రమ యోచనా వైఖరిని తర్కబద్ధంగా ఏర్పర్చుకోవాలి. ప్రశ్నే ప్రగతికి మూలం, ముఖ్యం, మార్గం.

అక్షరాల్ని వివేకంతో వీక్షించి దార్శనికంగా తర్కించడం వేరు, మొక్కుబడిగా చదివి అయిందనిపించి మౌనం పాటించడం వేరు. కొంతకాలం నుంచి నిర్విరామంగా శక్తివంచన లేకుండా ముద్రిస్తోన్న పుస్తకాలకవుతోన్న ఖర్చు కనీసంగానైనా ముట్టకపోవడం పట్ల కూడా నేనెప్పుడూ బాధపడలేదు కానీ, ఎంతో కొంత సన్నిహితులనే భ్రమతో పనిగట్టుకు పంపుతున్న గ్రంథాల్ని అందుకుంటున్న అచేతన మేధావులంతా తిరిగి నేనడిగితే తప్ప పుస్తకాలొచ్చాయనే విషయాన్ని నాకు చెప్పడానికి కూడా తీరికలేనంత ఇరుకుగా బతుకుతున్నారని తెలిసినప్పుడు మాత్రం మనసుకి కష్టమనిపిస్తుంది. వారి స్తబ్దతకి సిగ్గనిపిస్తుంది.

నేనెప్పుడైనా మానవతను ప్రాతిపదికగా ఎంచుకున్న సొంత మెదడుకల మిత్రుల్నే ఆశించాను కానీ, మూస మనస్తత్వపు మూకల్ని కాదు. వ్యవస్థాగతంగానే వైరుద్యాల్ని ఆహ్వానించాలనే వైవిధ్య హృదయం కలవాడ్ని, వ్యక్తిగతంగా నన్ను మాత్రమే అనుసరించమని సిగ్గు లేకుండా ఎలా చెప్పగలను? నా అక్షరాల్లో, ఆచరణలో ఎక్కడైనా అలాంటి తప్పులు దొర్లితే, అట్టే పెంకితనానికి పోయి అనవసరంగా అల్లరిచేసి లొల్లి లేకుండా చెంపలు పట్టుకుని లెంపలేసుకుంటాను గానీ అంతిమంగా అందరూ అసూయద్వేషాల్ని అధిగమించగల స్థాయికి ఎదిగినప్పుడే ఆధునికమైన నాగరికత ఔన్నత్యం సాధ్యపడుతుందని నా భావన.

అనేక ఆర్థిక – సాంఘిక సమస్యలు ఆద్యంతం చుట్టుముట్టి ఆదరాబాదరాగా దడికట్టి అడ్డుగోడల్ని నిర్మించాలనే కుట్ర పన్నినపుడు సైతం స్వేచ్ఛకి భాష్యం చెప్పాలనే నా కోరిక చావలేదు. ఎలాగూ దక్కని ధరకోసం పుస్తకానికి వెలకట్టి వ్యక్తిత్వంలోని వెలితిని వెల్లడించుకోడం ఇష్టంలేకే దీని విలువ పాఠకుల అభీష్టానికే వొదిలేసాను. ముష్కర దాడుల మధ్య బయటికి తెస్తున్న మూడో పుస్తకమిది. సత్యాన్వేషణకి సంచలనాల సవారీలక్కర్లేదు. వాస్తవాల శోధనకి వాగాడంబరాలతో పన్లేదు. యదార్ధ వేదనలకి యతిప్రాసలతో కూడిన చిత్రణ సరికాదు. రచన సామాజిక బాధ్యతకేకాని సాంఘిక హోదాకి సంకేతం కాదు, కారాదు.

జై ఇన్‌సాన్



# తత్వ విచారణ–తర్క వివేచన

**(Philosophical Enquiry-Logical Wisdom)**


## గౌరవ్



**ప్రశ్న అధ్యయన వేదిక**

**పిఠాపురం**

**తూర్పుగోదావరి జిల్లా**

# Progressive Movements and Avarice

*– Har Dayal*

Avarice works havoc with all progressive movements. Freedom from this vice is the essential condition for the birth and development of new movements, as rain is indispensible for the crops. A pioneer in religion or politics must say, like the apostle :"Silver and gold have I none". He cannot earn much money in any country, as he must devote much time to free propaganda, and also suffer ostracism and unpopularity. If all the ardent well-educated young men and women are avaricious, who will initiate progressive movements? If they all grasp at gold, who will serve Truth and Justice? At present, many able persons prostitute their talents in the service of Capitalism, which alone can give them big salaries and the much-coveted luxuries. They sell their brains for Rolls-Royce cars and costly cigars and Wines. Avarice robs the world of many potential prophets, reformers, and revolutionists. There is enormous infant mortality among the young enthusiasts of each generation. Their souls are born into the realm of Virtue and Freedom, when their bodies attain the age of twenty; but, during the next ten years, most of these souls are strangled and slain by avarice. The well-fed bodies continue to live, stinking cadavers infested with the loathsome worms of Capatilism. Such dead souls are as numerous as the hired intelligent servants of capitalism, who were born poor and died rich. Therefore, if new movements are to arise, some gifted youths must conquer Avarice and prefer the simple life. Avarice hinders the birth of great movements; it also hampers their development. The pioneers and apostles of religious and political movements must live in poverty, as there is no organization that can pay them well for their self-imposed services. They cannot acquire wealth, as they refuse to serve the powers that be. Their supporters are few and the movements are always in financial difficulties. Only noble men and women, who are free from avarice, can nurse new ideas and ideals into maturity.

Avarice is thus the enemy of all new movements, without which human society would stagnate. It can also ruin ahd disintegrate such movements after they have grown in strength and won millions of adherents. Like the germs of tuberculosis and influenza, Avarice is in the air all the time, ready to pounce upon the soul that have been enfeebled by selfishness and self-indulgence. If... Leaders yield to Avarice, the movements are lost forever. They then cease to be teachers and become traitors. Therefore, if you wish to reform religion or politics, first free your soul from Avarice. Wash it entirely clean from greed, so that it is pure and spotless.



# రచయిత వివరాలు

| | | |
|---|---|---|
| పేరు | : | గౌరవ్ (మేకా కృష్ణ గౌరవ్ @ అమర్) |
| పుట్టింది | : | రాయపూర్ (ఆనాటి మధ్యప్రదేశ్ నగరం, ప్రస్తుతం చత్తీస్‌ఘడ్ రాష్ట్ర రాజధాని) |
| పెరిగింది, చదివింది | : | పిఠాపురం, (తూ॥గో॥ జిల్లా) |
| వయస్సు | : | పాతిక నిండాయి (ఇరవైయారు) |
| వృత్తి | : | దొరికిన ఉద్యోగాలు చేయడం (దేశ వ్యాప్తంగా) |
| ప్రవృత్తి | : | రాయడం–చదవడం–తిరగడం |
| ప్రస్తుతం | : | ఖాళీ (మళ్ళీ పనికోసం ప్రయత్నాలు) |
| నచ్చేవి | : | ప్రకృతి, పిల్లలు, పుస్తకాలు, మిత్రులు |
| నచ్చనివి | : | అసూయ, అత్యాశ, మోసం, ద్వేషం |

---

"It has been the peculiar misfortune of India to be known more by her superficilities than by her essentials. India is not a country of tigers and snakes alone. It is not all a country of saints and hermits. Nor is it 'lion cloth' and 'goats milk' Tajmhal, Seville Row, the white residences of Simla are not the whole of India. India did not always pray and meditate. India has its teeming masses, its struggles, its history. Those who only known an ascetic India do not understand India. Its masses struggled for life, groaning under the weight of oppression, rebelled, took to arms, were defeated and misled. Now and then a Buddha, a Mahavira, an Ashoka, a chaitanya came across their way. What little they gained they lost. Autocracy after autocracy broke their spines. With all this, India is not without revolutionary traditions. Leaders of democratic progressive thought were non-Brahmins. Some of her kings were of non-Kshatriya origin. The best protestant thought is from non-Brahmana castes. Even in our own generation, India's first labour leader was a workman. Likewise, India is not wanting in materialist thinkers. Not all thought is other worldly. Not all thought is idealistic."

– Dr. K.B. Krishna

*Studies in Hindu Materialism, Milinda Publications*